# పురాణవాచకము

## ఎనిమిదవ తరగతి.



గ్రంథకర్తలు:

విద్వాన్, గరిమెళ్ళ సోమన్న పంతులుగారు, ఎమ్.ఎ., ఎల్.టి.,

భోగరాజు నారాయణమూర్తి పంతులుగారు.



పబ్లిషర్సు:

వేంకటరామ్ అండ్ కో.,

హెడ్డాఫీసు.—ఏలూరు.

రామా పవర్ ప్రెస్సు, ఏలూరు.

1930



[వెల 0-8-0.

# విషయసూచిక.

(కవిజీవిత సంగ్రహములు.)

# పురాణవాచకము

## ఎనిమిదవ తరగతి



### భాస్కర రామాయణము.

## 1 సుగ్రీవ మైత్రి



[భాస్కరుఁడు రామాయణమును వ్రాసెను. దానికి "భాస్కర రామాయణ' మనిపేరు. భాస్కరుఁడు భారతమును వ్రాసిన తిక్కనకుఁ బితామహుఁ డగుటచేత 13 వ శతాబ్ద ప్రారంభమున నుండియుండును. తిక్కనతాతయగు భాస్కరుఁడు వేఱనియు రామాయణకర్తయగు భాస్కరుఁడు వేఱనియు నొక ప్రబలమైన వివాదము జరుగుచుండుటచేతఁ బ్రస్తుతము భాస్కరునికాలము నిర్ణయించుట సాధ్యముగాదు.]

వ॥ రామలక్ష్మణులు సీతాన్వేషణంబుఁ గావించుచు వనంబు లెల్లఁ గ్రుమ్మరి క్రమక్రమంబుగ ఋశ్యమూకారణ్యంబునఁ బ్రవేశించిరి. అయ్యరణ్యంబును నచ్చటి ఋశ్యమూకనగంబును సుగ్రీవుఁ డను వానరేంద్రునిసంచారప్రదేశంబులు. సుగ్రీవుఁడు తనయన్నయగు వాలితో విరోధించి వానిచేఁ బరాజితుండై తనసేనలతో వచ్చి యప్పర్వత ప్రదేశంబుల డాగియున్నవాఁ డగుటం జేసి, వల్కలాజిన

ధరులును గోదండబాణకృపాణపాణులు నగురామలక్ష్మణు లను జూచి వాలిపంపునఁ దన్నుఁ గడతేర్పవచ్చిన కపటంపు ఋషివేషధారులుగా భావించి యావిశేషంబును దనమంత్రుల కెఱింగించెను. తోడనే దుర్నిరీక్ష్యతేజస్సంపన్నులగు నయ్యన్నదమ్ములం జూచి యత్యంతభయభ్రాంతులై,

క॥ గిరిగిరిశిఖరంబులకును
దరుతరుశాఖలకు దావదావంబులకుఁ
బోరిఁబోరిదాఁటులు వైచుచుఁ
ద్వరితగతిం బాఱి రన్యవననగములకుఁ.

వ॥ ఇట్లు కలంగి తొలంగిన సుగ్రీవసచివులు హనుమంతుం బురస్కరించుకొని యొక్కెడఁ దొలంగియున్న సుగ్రీవునిపాలి కేతెంచి ప్రాంజలులైయుండ నప్పుడు హనుమంతుఁ డినతనయు నుపలక్షించి, 'నీ వెవ్వరిం జూచి వాలి పంపినవా రను భయంబునఁ దొలఁగ నేతెంచియున్నవాఁడవు? వారు వాలి పనుప వచ్చినవారలు గారు. పూర్ణవివేకము లేక చేలవై యేల మనంబునం బెగడెదు' ననుటయు సుగ్రీవుం డిట్లనియె.

ఉ॥ వారలు వాలిపంపునన వచ్చినవా రను శంక నామదిఁ
వారక నాటియున్నయది, వాలియు నామెడఁగ్రించు; రాజులే

పార ననేకమార్గముల నప్రియులం బెగఁజూతు రేర్పడన్
వారి నెఱుంగఁగావలయు; వచ్చు నెనమ్మఁగ నెందురాజులన్?

వ॥ మఱియుఁ బ్రచ్ఛన్న వేషధారులగు వారలం జారులవలన నెఱుంగవలయు.

చ॥ అనిలతనూజ! నీవు ప్రియమూరఁగ వారలఁ జేరి వార లీ
వనమున కేమికారణము వచ్చిరొ, యేటికి నస్త్రశస్త్రముల్
తనరఁగఁ బూనినారొ, రణదర్పమునం జనుదెంచినారొ నే
ర్పునఁబరికింపు రూపములఁ బోలఁగమాటలసత్త్వదృష్టులన్.

క॥ వారలు సన్మనులైనన్
గోరిక విశ్వాస పఱచి కూడి ప్రశంసల్
సారెకుఁ జేయుచు సామం
బారఁగఁ గావింపు మనకు నభిమతమొందన్.

వ॥ రవినందనునభిమతం బీడేర్పఁ దోడనె వాయునందనుండు భిక్షుకరూపంబుఁ దాల్చి రాఘవులసమీపించి సందర్శించి భక్తిపూర్వకంబుగ దండనమస్కారంబులు గావించి ప్రియోక్తుల నగ్గించుచు నిట్లనియె. "అయ్యా! మీరు నర మునివేషములొందిన నరనారాయణులో భూమిం జరింప వచ్చిన సూర్యచంద్రులో యన మెఱయుచుఁ బరస్పర సమాన రూపయౌవనగుణలక్షణవిక్రమశ్రీమవి శేషంబులఁ బరగుచున్నారు. మఱియు

మ॥ పరిఘాత్యాయతబాహులశ్వని సరూపపాత్రిప్పులుగ్రిపత్రిభా
భరితుల్ పార్థివలక్షణాకలితులై భాసిల్లుచున్నారు; మీ
రరయర్ వార్థిపరీతభూభువనరాజ్యంబొంద నర్హుల్ జటా
భరకృష్ణాజినవల్కలంబులు ధరింపం గారణం బేమొకో?

శా॥ సుగ్రీవుండను వానరేంద్రుఁడు రణక్షోణీస్థలిం దన్ను న
త్యుగ్రప్రక్రియ వాలి దోలినఁ గడున్ దూరస్థుఁడై ఋశ్యమూ
కగ్రావంబుననుండి మీకడకు సఖ్యంబొప్పఁగావింప బు
ద్ధిగ్రాహిత్వముతోడఁ జెల్మికిని బుత్తెరంగ నే వచ్చితిన్.

క॥ తపనతనూజుని సచివుఁడఁ
గపిమూర్తినిఁ గామరూపిఁ గామగముఁడ గా
డుపుతనయుఁడ హనుమంతుఁడఁ
గపటప్రభిక్షుకుఁడ దూతకార్యంబునకున్.

వ॥ మీపాలికి నే నేతెంచితి. మీ రేరాజసుతులరో? యేమహా
నుభావులరో? యీపంపాతీర దుర్గమారణ్యంబున కరుదెం
చిన కారణంబేమియో” యనిహనుమంతుండు పలికిన రామ
చంద్రుఁడు మందస్మితవదనారవిందుండై సుమిత్రానందను
తోడ మనవచ్చిన వృత్తాంతం బెఱింగింపు మనిన సౌమిత్రి
యావాయుపుత్రుం గనుంగొని, “హనుమంతా! దశరథుఁ
డను మహారాజునకు మహానుహుఁ డగ్రపుత్రుఁడు; నా
కగ్రజుఁడు. ఈ సుగుణాభిరాముండు రాముం డనఁబరఁగు
చుండు. సర్వభూతహితుండును జనతాశరణ్యుండును నగు

రామచంద్రుఁడు జనకునిసత్యంబు నెఱప సమస్తరాజ్యంబును బరిత్యజించి పత్నియుం దాను వనంబుల కేతేర, మేము లేనప్పు డొక్కరక్కసుండు కపటియై యీతని దేవియైన సీత నపహరించికొనిపోయె. మేము వానిం గానక యెల్లకడల వెదకుచుఁ దిరుగుచుండ నొక్కయెడ ముని శాపంబున దనుజుండై పుట్టిన దను వను గంధర్వుఁడు 'మీరు సుగ్రీవుని స్నేహంబున సీతజాడ లెఱుంగఁగల' రని చెప్పి దివి కేఁగె. మేమును సీతాసతి శుభవార్త వినుకతూహలంబున సుహృద్భావంబున భానునందనుమైత్రి సంపాదింప నీ పంపాతీరంబున కేతెంచినవార" మని పలికి మఱియు నిట్లనియె.

"సీ॥ ప్రజలు ప్రసాదంబుఁ బడయఁ గోరెడుభర్త
తరుచరేంద్రునిప్రసాదంబునొంద,
సకలలోకులకును శరణమం డగురాజు
కిరమర్థి సుగ్రీవుశరణుసారఁగ,
నరనాథుఁ డగులోకనాథుండు ప్లవగనా
థుం డిచ్చుఁ దనకు నాథుండుగాఁగ
నఖిలలోకసహాయుఁ డై యుండు పుణ్యుండు
కపివర్యసాహాయ్యకంబు వేఁడ
గీ॥ రాజులెల్లను సేవించు రాజగురుఁడు
వానరేంద్రుని సేవింప వచ్చినాఁడు

రామచంద్రున కిట్టి దుర్దశలు వచ్చెఁ
జారుచారిత్రియగు సీత కారణమున.

గీ॥ ధైర్యనిధియయ్యుఁ దనపత్నిఁ దలఁచి తలఁచి
రామచంద్రుండు శోకవారాశిచంద్రుఁ
డగుచు నధికదైన్యంబుతో నాననంబు
విన్ననై యుండ నిచ్చట నున్నవాఁడు."

వ॥ అనుచు బాష్పాకులలోచనుం డగుచున్న లక్ష్మణుం గనుంగొని హనుమంతుఁ డూరార్చుచు నతని కిట్లనియె.

శా॥ ఆలం బుద్ధతిఁ జేసి చేవచెడి ధైర్యం బేది యవ్వాలిచే
నాలిం గోల్పడి వీడు వోవిడిచి రాజ్యభ్రష్టుఁడై సంచిత
శ్రీలెల్లం జెడి కానలో మఱుఁగుచుం జేట్పాటుతో నుండుటన్
జాలంబోలఁగ మీకు నర్కజునకున్ సఖ్యంబు వే కల్గెడున్.

క॥ మీరును సుగ్రీవుండును
గారవమునఁ బొత్తుసేసి కపిసేనలతో
నారవిజుఁడు దోడ్పడఁగ ను
దారత సాధింపఁగలరు ధారుణియెల్లన్.

వ॥ అమ్మాటలకు లక్ష్మణుండు ప్రియంబంద, రఘువరుండును హర్షించి, యంజనీసుతుని సంభావించి, "కపివరా! మేము సూర్యకులజాతులము. సుగ్రీవుండును సూర్యనందనుఁడు. మా కవశ్యంబుగ సఖ్యంబు గాఁదగిన" దని పలికెను. హనుమంతుండును ముదంబంది రాఘవులు కృత

కార్యసిద్ధు లై రనుచు నా రామలక్ష్మణుల సముచితసంభాషణంబులం దేల్చి వారలం దోడ్కొని ఋశ్యమూకంబు గడచి మలయాద్రి కరిగి యచ్చట రాఘవుల నునిచి సుగ్రీవుని సన్నిధి కేగి "సుగ్రీవా! నీతోడి సఖ్యంబునకు రామలక్ష్మణులం దోడ్కొని వచ్చితి. కృతార్థుండ వైతివి. ఆ రామచంద్రుండు ధర్మజ్ఞుండును గృతజ్ఞుండును సత్యసంధుండును బితృవాక్యపరిపాలకుండు నధికబలపరాక్రముండు నాశ్రితవత్సలుండును గావున నీమనోరథంబు సఫలంబుసేయ సమర్థుండు. జనకాజ్ఞ నడవి కేతెంచి తనపత్ని రాక్షసాపహృతయైననిమిత్తంబున నిన్నుం గాన నేతెంచె. నీవు నమ్మహానుభావుని నభివందనపూర్వకంబుగ సంభావింప నర్హుండ" వనిన హనుమంతువాక్యంబులకు సంతోషించి, సుగ్రీవుండు వాలివలనిభీతి వాడినపుష్పదామంబునుం బోలె విడిచి, హనుమంతునితోఁగూడ నధికసమ్మదంబున నేతెంచి, రామభద్రుని పాదపద్మంబులకు మ్రొక్కి యల్లన నిట్లనియె. "రామచంద్రా! నీధర్మజయసత్యపరాక్రమశక్తులెల్ల ననిలనందనుండు నాకుఁ దెల్లంబుగ నెఱింగించె. నీశుభదర్శనంబు నాకు రాజ్యప్రాప్తికిఁ గారణంబగుఁగాక. అధికోత్సాహంబున నీనెయ్యం బభిలషించువాఁడను గావున నన్ను విశ్వసించి చేయి సాపు" మనుటయు, రాఘవుం 'డగుఁగాక'యనిచేయిసాపెను. అప్పుడు రామసుగ్రీవులు

గాఢస్నేహసూచకంబుగ నాలింగనములు చేసిరి. వాయు కుమారుండును గాష్ఠయుగంబుఁ దెచ్చి మథించి యగ్ని నుద్భవింపంజేసి యర్చులిడి ప్రవృద్ధమొనర్చి వారియెదుటం దెచ్చిపెట్టిన నన్నరేశ్వరవానరేశ్వరు లిరువురును బ్రదక్షిణముచేసి యగ్నిసాక్షిగ సఖ్యంబు గావించుకొనిరి. ఇట్లు బద్ధసఖ్యులైనంత నర్కజుం డధికానందంబున నర్కవంశజుం గాంచి.

"క॥ కాకుత్స్థ! యింక వగవకు
నీకడకున్ వేగ దెత్తు నీసతి దివిష
ల్లోకమున నున్నఁ బన్నగ
లోకంబున నున్న నబ్ధిలోపల నున్నన్.

మ॥ బలిమిన్ నాప్రియపత్నిఁ దోచుకొని కోపక్రూరతన్ వీటిలో
పల నన్నున్ వసియింపనీక వెలికిం బాఱంగ వేతోలినన్
బలవంతుండగు వాలికోర్వక భయభ్రాంతుండనై చింతలో
నెలయన్ వందురుచున్నవాఁడవగతో నీఋష్యమూకస్థలిన్.

వ॥ కావున నోదేవా! నే ననాథుండను. అనాథనాథుండవగు నీవు నన్నుం గాపాడి నామానమును బ్రోవవలయు" నని దీనముగఁ బ్రార్థింప భక్తవత్సలుండగు రామభద్రుండు వాని గరుణించి యాదరించి కౌఁగిలించి, యిట్లు వచించె. "వానరేశ్వరా! నీ వింకఁ జింతింపం బని లేదు. నీ వాంఛి

తంబులెల్ల నేనెఱుంగుదు. నీకు రాజ్యలక్ష్మియు నర్థాంగ లక్ష్మియు సిద్ధించుఁగాక!

చ॥ కనదురురత్నపుంఖములు కాలభుజంగమహోగ్రములు మహా
శనిసదృశప్రభావములు షణ్ముఖకాననసంభవంబులుం
ఘనతరకంకపత్త్రములు గల్గిన యీశితసాయకంబులన్
దునిమెద వాలిలీలఁ ద్వరతో నిలశైలముఁబోలెఁగూలఁగన్.

---

భారతము.

## 2 పద్మవ్యూహము

[తిక్కన నెల్లూరు వాస్తవ్యుఁడు. మనుమసిద్ధిరాజునకు మంత్రి. నియోగి బ్రాహ్మణుఁడు. వీని కాలము 13 వ శతాబ్దము. తిక్కన మొదట నిర్వచనోత్తరరామాయణమును వ్రాసి పిదప యజ్ఞముచేసి సోమయాజియై విరాటపర్వము మొదలు 15 పర్వములుగల మహాభారతమును దెనిఁగించెను. వీనికిఁ గవిబ్రహ్మ యను బిరుదు గలదు.]

వ॥ మహాభారతయుద్ధంబున సుప్రసిద్ధం బగుపద్మవ్యూహమున కర్జునకుమారుండైన యభిమన్యుఁడు కథానాయకుఁడు. తనతండ్రులు లేపురును దమకు న్యాయముగ రావలసిన దాయభాగమును గూర్చి ప్రయత్నించుటయు శ్రీకృష్ణుని రాయబారిగ నంపుటయు దుర్యోధనుఁడు పొందున కిచ్చ

గింపక తృణీకరించుటయు మున్నగు విశేషంబులెల్లఁ బ్రద్యుమ్నాది యదుకుమారులతో ధనుర్విద్యాభ్యసనం బొనర్చుచుండిన యభిమన్యుం డెప్పటి కప్పుడె యెఱుంగుచుఁ, గౌరవులతోడి పోరాటంబగుట నిశ్చయించుకొని యత్యంతరణోత్సాహంబును బొందుచుండెను. క్రమక్రమంబుగ సంధియుద్యమంబెల్ల విఫలంబగుటయు సంగ్రామంబె నిశ్చితం బగుటయుఁ గురుక్షేత్రంబునఁ బుణ్యదినంబగు నమవసనాటియుదయంబున మహాభారతయుద్ధము ప్రారంభింపఁబడినది. కురుసేనలకెల్ల గాంగేయుఁడు నాయకుండై పది దినంబులు తన సంగరక్రియాకౌశలమును బ్రకటించి శరతల్పగతుండయ్యె. అంతఁ దత్సేనానాయకత్వము ద్రోణునకొసంగఁబడియె. ఆ పదిదినంబులలో భీష్మునిపరాక్రమానలంబునం బడి పాండవయోధులు నిలువలేక తత్తరపడుచుండ నభిమన్యుఁ డయ్యోధాగ్రేసరు నెదిరించి పెక్కుసారులు తనసైన్యంబుల రక్షించె.

సకలకురుకుమారకధనురాచార్యుండగు ద్రోణాచార్యుండు సేనానియై రెండునాళ్ళు పోరాడి మూఁడవనాఁడు పద్మవ్యూహమును బన్నెను. వ్యూహములందెల్ల సుప్రసిద్ధమగు నీపద్మవ్యూహాకారము పలువిధములఁ జిత్రింపఁబడుచు నేఁటికిని మిక్కిలి ప్రచారమున నున్నది. ఆనాఁడా వ్యూహమునకు గురుండు సకలదేశాధీశ్వరులను దళంబు

లుగను రాజకుమారులఁ గేసరంబులుగను, కర్ణదుశ్శాసన బహుళసేనాపరివృతుండైన రారాజును గర్ణికగను నిర్ణయించి యభేద్యంబుగ నొనర్చెను. మఱియు నవ్యూహాగ్రరంబునకుఁ దాను మొగమ్మున నిలిచి ద్రోణుఁడు జయద్రథాశ్వత్థామకృపశకునికృతవర్మశల్యప్రముఖులను గురుకుమారకులను దక్షిణచోటుల నుండ నియోగించెను. అప్పుడు పాండవవీరుల నేకులు వ్యూహాగ్రంబున నున్న కుంభసంభవుం దలపడిరి. సాత్యకిధృష్టద్యుమ్నఘటోత్కచవిరాట్ద్రుపదభీమనకులసహదేవాది మహావీరులెల్లరు నవ్యూహము భేదింపఁ బ్రయత్నపడి భేదింపనేరక ఖిన్నవదనులైరి. ధర్మజుండును మొగము వెలవెలఁబాఱ నేమిచేయుటకుం దోఁపక కర్ణికారకేతనవిరాజితుండును విపులవిక్రమసంపత్పరిపూర్ణుండును నగు సౌభద్రుం జూచి, వీఁడు దక్కనన్యు లివ్యూహాగ్రంబు భేదింపఁజాల రని నిశ్చయించుకొని వానిం జెంతకు రమ్మని యిట్లనియె.

సీ॥ ఈయొడ్డు భేదింప నే మెవ్వరము నేర
మర్జునుండును నీవు నచ్యుతుండుఁ
బ్రద్యుమ్నుఁడును దక్కఁ; బార్థుండు మనల ను
ల్లసమాడకుండ నీలావుమెఱసి
భేదించి మాకెల్లఁ బ్రియమొనర్పు కుమార!"
యనవుడు నతఁ డానన్దమున లర

"దీనిముఖంబు భేదించు తెఱంగు నా
కెఱుఁగించె మాతండ్రి యేను దెలిపి
ఆ॥ వె॥ సేయనేర్తుఁ జొచ్చి చించిచెండాడెద
మూఁక పోరఁ జుట్టుముట్టినపుడు
వెడలునట్టి వెరవు వినఁ; దాని కేమి, నా
చొచ్చునేర్పు బలువుఁ జూడు మధిప!"

అనిన విని ధర్మనందనుండు ధనంజయనందనుం జూచి "కుమారా! నీ వించుక త్రోవచేసి లోనఁ జొచ్చినం జాలును. నీవెంబడిన మేమెల్లరముం జొచ్చెదము. మా కీవరం బొసంగు" మనుటయు, భీముండును 'కుమారా! నేనును సాత్యకియు ద్రుపదవిరాటాదులును నీకుం దోడుగ వచ్చువారము. నీ విమ్మొగ్గరంబు భేదించి మార్గంబు సూపినం జాలు' ననిన నభిమన్యుం డాతనియాననం బాలోకించి,

చ॥ సను విను కీచకాంతక! మ
నంబున ద్రోణుఁడు మెచ్చఁజొచ్చి, య
మ్మొనఁ గలఁగింప కిట్లు కురు
ముఖ్యులు ధర్మసుతుండు గారవిం
చిన జతనంబు నిష్ఫలము
సేయుదునే? నరుఁడుం సుభద్రయుం
దనయునిఁ గాంచి సంతసముఁ
దాల్చుట యంతయు రిత్తఁబుత్తునే?

చ॥ ఇదె యొకపిన్నవాఁ డడరి
యెక్కుడు మూఁకలఁగ్రిందు దోలెడుఁ
గదుపుల వెల్చు గోపకుని
కైవడి నంచు జనుల్ నుతింపఁ జే
సెద, విని మామ ప్రీతి విల
సిల్లఁగఁ దండ్రియు సంతసిల్ల బె
ట్టిదుఁడగు కౌరవేంద్రునకు
దెప్పరమయ్యెడు భంగిఁ బేర్చెదన్.

వ॥ అనిన విని ధర్మజుండు ప్రీతింబొంది నీదు ధైర్యంబును శౌర్యంబును బలమును గీర్తియు వర్ధనమొందెడు మని దీవించి యంపిన సుభద్రకొడుకు సముదగ్రసమరోత్సాహంబునఁ దన సారథిం గనుంగొని 'మనయరదంబు ద్రోణానీకంబుపైఁ బఱపు' మనుటయు నాతుమిత్రుం డర్జునపుత్త్రున కిట్లనియె.

గీ॥ బాలుఁడవు నీవు కుంభజప్రముఖసైన్య
పతులు ప్రౌఢులు పెక్కుగు బవరమునకుఁ
జొచ్చి యెఱుఁగని నీచేతఁ జచ్చువారు
కారు, బహువిధసమరకర్కశులు వారు.

చ॥ అనవుడు నల్ల నవ్వి యతఁ
డాతని కిట్లను దేవయుక్కుఁడై

యనికి బలారి వచ్చినఁ బు
 రారి గణంబులుఁ దానుఁ బన్నినన్
గినిసి కడంగి క్రీడియును
 గృష్ణుఁడుఁ దాఁకిన నే జయింతు వా
రొక్కని యనుచుండుదుర్, సర
 కుఁగొందునె ద్రోణునిఁ దోడియోధులన్.

వ॥ అని పలికి వానియాలాపంబు నాలంబు సేసి యభిమన్యుండు పెలుచం దఱిమిన వాఁ డనుమానించుచుఁ బద్మవ్యూహంబు సమ్ముఖంబుగాఁ దేరునడపుటయుఁ బాండవసేనయుఁ దోడన కడంగుటయుఁ గనుంగొని భారద్వాజప్రముఖయోధులొండొరులకుం దలమిగిలి యేచి యెదురొక్కని పెలుచనిలిచిన సంకులసమరంబయ్యె, నట్టియెడ

ఆ॥ వె॥ మెఱుఁగు మెఱచినట్లు మెఱయంగ నరదంబు
 కర్ణికార కేతుకాంతి వెలుఁగ
 నంపగముల గురుని నలయించి కడచి యిం
 ద్రిజునికొడుకు మొగ్గరంబు సొచ్చె.

వ॥ ఇట్లు దేవాసురలకైన నభేద్యంబగు నాపద్మవ్యూహంబును భేదించి ప్రవేశించి మహాసముద్రమధ్యంబునఁ దిరుగు మందరగిరి తెఱంగున, శుష్కకాననమున సంచరించు ఘోరానలముభంగి, దక్షయాగమునందలి వీరభద్రుని విధంబున వీరవిహార మొనర్చుచు, నమ్మోహారంబు రూపు

మాపి, క్రూరనారాచముల గజకుంభములఁ జీల్చుచు, హయంబుల నడఁగించుచుఁ, బతాకమ్ములఁ బడనేయుచు, నాతపత్రములఁ ద్రుళ్ళించుచు, ధనువులఁ దునియలొనర్చుచుఁ, గరవాలంబుల ఖండించుచు, మేనులఁ జెండాడుచుఁ, దూపులఁ దూలించుచుఁ, గరచరణాద్యవయవంబుల వేఱుసేయుచు నెత్తురు పాఱించుచు నమ్మొగ్గరమ్మును మిక్కిలి చిక్కువెట్టి కలఁగించి తొలంగించి దీనదశకుం దెచ్చె. పద్మాకరమును గలంచు భద్రగజముభంగిఁ బద్మవ్యూహమును గలంచు సౌభద్రు నీక్షించి కౌరవేంద్రుం డుగ్రాకారుఁడై యాఁకలిగొన్న సింగంబుం దాఁకు మాతంగము తెఱంగున నెదుర్కొని మార్కొనియె.

అట్లభిమన్యుం దాకినరారాజుం జూచి భారద్వాజుండు చేయివీచి యెలుంగెత్తి “వీరులారా! రండు రండు! రారాజునకుఁ దోడ్పడుఁడు. అభిమన్యుఁ డుద్దండుఁడు. మీమీ ధైర్యసాహసంబుల వినియోగింపుఁ” డని హెచ్చరించెను. ఆయెలుంగు వినినంతనె కృపుఁడును గురుకుమారుఁడును గృతవర్మయుఁ గర్ణుండును సోమదత్తపుత్రుండును శల్యుఁడును సౌబలుఁడును మున్నగు మహావీరులెల్లరు గురునివెంట బిరబిర నేగి కురుపతికిఁ దోడుగఁ గవ్వడి కొడుకు నెదురుకొనిరి. అమ్మహావిజృంభణమునకు ధనంజయనందనుండు లేశమ్మును భీతిల్లక మందహాసమొ

నర్చుచు లాఘవలక్ష్యశుద్ధిచిత్రత్వదృఢత్వంబులఁ గృష్ణార్జునులుచూపు నేర్పు సూపుచు దుర్నిరీక్ష్యుండగు చండభానుకరణిఁ జూపరులకు రౌద్రమూర్తియై తోఁచుచు భీషణంబగు గుణఘోషంబుతోఁ బెడిదంపు నారసంబులు ప్రయోగించి, లోకభయంకరంబుగ గర్జించుచుఁ బలుపిడుగులరాల్చు ప్రళయకాలవలాహకంబు కరణి విజృంభించి, యేమిసేయుటకుం దోఁపక కరచరణంబులాడక చేష్టలుదక్కి యాచార్యుం డూరకచూచుచుండునట్లు తత్సేనావితానముల నానావిధబాణపరంపరల ముంచి పఱువెత్తించెను.

అచట వ్యూహద్వారముకడఁ బాంచాలయాదవపాండ్యకేకయమాత్స్య సైన్యములతో ధర్మభీమనకులసహదేవాదు లెంత విజృంభించినను లోనం జొరనేరరయ్యె. నాఁ డావ్యూహాగ్రంబుకడ సైంధవుఁ డమ్మహావీరుల నెల్లర నడ్డగించెను. సామాన్యరథికుం డయ్యు సైంధవుం డంతటి మహాయోధుల నడ్డగించి నిలువరింపఁగలుఁగుట కొకప్రబలకారణంబు గలదు. పాండవు లరణ్యమున నున్నప్పుడు సైంధవుఁడు ద్రౌపదిని మోహించి వా రింటలేనియెడ నామెను బలిమినిఁ దనయరదంబున నిడికొని పోవుచు విధివశంబున వారికిం బట్టువడి యందు భీమునిచే సంపూర్ణంబుగఁ బరాభవింపఁబడియె. ఆపరాభవ దుఃఖంబున

సైంధవుండు తపంబొనర్చి శివుని మెప్పించి పాండవుల జయింపఁగలుగునట్లు వరంబు వేడ నర్జును నొక్కనిం దక్క తక్కిన నలువుర నీ వొక్కనాఁడు మాత్రము జయింతు వని యీశ్వరుం డనుగ్రహించె. ఆవరప్రభావంబున నతఁడు భీమసేన ప్రముఖుల నెల్ల నాఁడు నిరాయాసంబుగ నోడించెను.

ఇటు వ్యూహమధ్యంబున లోకైకవీరుం డగు నభిమన్యు ప్రతాపానలంబున ప్రుగ్గి పఱుఁగిడఁ దొడంగిన యోధవరుల నెల్ల ద్రోణుండు మహాప్రయత్నంబున నాపి పురికొల్పి యయ్యందఱితోఁ గూడ నా బాలకు నెదుర్కొనియె. విఱిగిన యోధు లెల్లరుఁ దనపైఁ దిరుగఁబడినంతనే నేయివోసిన యగ్నిజ్వాలవలె భగ్గనమండుచు సుభద్రికొడుకు నెత్తుటివరదలు ప్రవహింపఁ జేసె. హతశేషులైన కౌరవ వీరు లెల్లరు విచ్ఛిన్నరథోపరిభాగులై విదళితచ్ఛత్రులై తీవ్రాతపంబున మలమలమాడుచు మేనులు చెమటలెక్క మొగంబులు వెలవెలంబార నాలుకలఁ దడియాఱఁ గాళ్లు గడగడవడంక నలుదిక్కులం జూచును ధైర్యంబువిడనాడి యేక్షణం బభిమన్యుం డెవరిపైఁబడునో యని దిగులువడ సాగిరి. అట్టి యపరాహ్ణసమయంబున శత్రుంజయుండును జంద్రకేతుండును సువర్చసుండును సూర్యభానుండును మొత్తంబై తాకిన ధనంజయతనయుం డమ్మేటిమగల మేనులు నానాస్త్రంబుల ననేకఖండంబులు గావించి,

గాంధారపతి వచ్చిన వానిం గ్రూరనారాచజాలంబుల జర్జరితశరీరుం జేసి, దుర్యోధనుదెసకు నడచుచుండ నంగపతి గురున కిట్లనియె.

క॥ చండగతి వీరరథికులఁ
జెండుచు నేతెంచి రాజుఁ జేరెడు సౌభ
ద్రుం డిట్టిఁడు లీకూరక
యుండఁదగునె ప్రతివిధాన మొనరింపుతగన్.

క॥ అని పలికి పతికి నష్టము
సనుటయు గురుఁడచటి యోధచయముం గలయం
గనుఁగొని యభిమన్యుఁడు న
ర్జునుఁడును నని నొక్కరూప చూడీ తలఁపన్.

వ॥ చూడం జిన్నవాఁడుగాని యలంతులంబోయెడువాఁడు కాఁడు. మనముందఱముఁ గూడుకొని యొక్కపెట్ట యక్కుమారుపై నురవడింపవలయు నని పలికినఁ గర్ణుం డిట్లనియె, "ఆచార్యోత్తమా! వీఁడు న న్నెంత పీడించెనో నాశరీరంబుఁ జూడుము. అపయశంబున కోర్వఁజాలక పఱుఁగిడ కిందు నిలిచితి. ఇదివఱకుఁ బలుసారులు రణరంగంబున నర్జును నే నెఱుంగుదు గాని వానిచేయి యింత బెట్టిదంబుగాదు." నావుఁడు ద్రోణుండల్లన నవ్వుచు, "కర్ణా! కవచధారణ మను నొక మహావిద్యను నే నర్జునున కెఱింగించితి. దాని నీతండును వానికడ నేర్చియుండుటచే

నీబాలుని నోర్పించుట యశక్యము. ఎట్టులైన వంచన చేసి వీని విల్లుద్రుంచి, ఘోటకంబులం జంపి సారథి నడంచి యభిమన్యుని సాధింపవలయు. ఇయ్యది నీచేనైనచో నిట్లు సేయుము. కేల ధనువున్నంతకు వీని నెదిరించుట దేవతల కేని సాధ్యంబు గాదు."

చ॥ అన విని సూతసూనుఁడు భ
యంబెదఁ గూరినవాఁడపోలె నై
వెనుక కొదింగి యారథిక
వీరు పిఱిందికిఁ జుట్టివచ్చి, వం
చనకు సహాయులై యచటి
సైనికు లన్నరపుత్రు బిట్టు మా
ర్కొని పెనఁగంగఁ జేసి యల
ఘుప్రదరంబున విల్లు ద్రుంచినన్.

క॥ గురుఁ డశ్వంబులఁ గూల్చెను
సరభసముగఁ గృపుఁడు సంపె సారథి నట్లా
నరసుతుఁ డనాయుధుండును
విరథుండును నగుటఁజూచి వెఱపేదివడిన్.

క॥ శకుని కృతవర్మ శల బా
హ్లీక గురుసుతులాదిగా ననేకు లడరి య
స్త్రానలాపంబుల శస్త్ర
ప్రకరంబుల నొంచి చిక్కువఱచి యలఁచినన్.

క॥ వాలును బలకయుఁ గొని య
బ్బాలుఁడు రయమార గగనభాగంబున ను
న్మీలిత ధృతిసారుండై
లీల నెగసిపోయె మండలీభూతగతిన్.

వ॥ అదిచూచి యయ్యోధవరులెల్లరు మఱల భయాకుల చిత్తులై యాకస్మికముగ నాకసమునుండి సౌభద్రుం డెవ్వరిపైఁబడి యెవ్వరి నంతమొనరించునో యని తత్తరపడసాగిరి. ఆతత్తరపాటు తొలంగునట్లు గురుండు తోడనే యొక బల్లెమున నభిమన్యు కేలంగల కరవాలము ఖండింపఁ గర్ణుండును వానిడాలును శకలంబులొనరించెను. అప్పు డయ్యసహాయస్థితి కర్జునతనయుండు లేశమును భీతిల్లక తనరథంబుపై వ్రాలి చక్రాయుధంబుఁ గైకొని యుపేంద్రునివలె శోభిల్లుచు నెత్తురుగార్చుచు నాగ్రహాతిశయంబునఁ గడు నుగ్రంబైన ముఖకాంతితో, కౌరవసేనాసముదయంబులగుండియలు వ్రక్కలు సేయు సింహనాదంబుతో ఆకసమునంటు రథాంగప్రభలఁగలిసి భాసిల్లు మణికంకణ ద్యుతులతో, అంకుశంపుఁబోటునఁ జెలంగిన గంధసింధుర సంరంభముతో నాకుంభసంభవునిపై విజృంభించి, యడ్డంపడిన సేనల నెల్లఁ జక్రాయుధంబున సంహరించుచుండ, సమ్మేటిమగని మగతనమును బలమును జలమును వేలుపులు వేనోళ్ళఁ గీర్తింపసాగిరి.

అప్పుడు శకునికృతవర్మకృపకర్ణశల్యముఖ్యులైనమహా వీరులు పలువురు మఱల నలుదెసల నతనిం జుట్టుముట్టి, వాని చక్రాయుధంబును దునియ లొనరించిరి. అభిమన్యుండును నుద్దండగదాదండంబు నొండు దాల్చి గురునందనునిపైఁబడ నతండు ప్రాణభీతిం బఱచె. సౌభద్రుండు వాని సారథి రథ్యములఁ జావమోది, తనకడ్డముగ నున్న మహావృక్షముల నెల్లఁ బీకి పాఱనైచు జంఝానిలునిక్రైవడిఁ జెలరేఁగి, గాంధారవీరుల నిర్వదియేడ్వుర నుక్కడంచి, తన్నుమార్కొనిన వసాతీయులఁ బదుగుర నేనుంగులతోడనె పీనుంగుల గావించి, యందందుఁ దన్నెదిరించుచుండిన కేకయసప్తకంబును రథసమేతంబుగ రూపుమాపి, డస్సి యోడి పఱుఁగిడిపోయెడి యోధులం గని కలకల నవ్వుచు నుల్లసంబాడుచు నాకుమారవీరుఁడు తన వీరవ్రతమును గడు స్థిరత్వనిష్ఠతోఁ జరిపెను.

ఆసమయంబున దుశ్శాసనుకొడుకు తనమనంబు సంస్థిత మొనర్చుకొని యభిమన్యుం దాఁకె నతఁడు వాని సారథి నడంచి హయములఁ బడనేసెను. అంతతోఁ బోక దౌశ్శాసని తురంగరహితం బగు తన శతాంగమును లంఘించి సౌభద్రునితో గదాయుద్ధంబునకుఁ దొడంగెను. తమ్ముఁ జూచువారి కద్భుతమ్మును సంతాపంబును గదుర శరీరములు రుధిరధారాపూరితములై చెలంగ నాఁ డయ్యు

న్నదమ్ముల బిడ్డలిరువురు నతిభయంకరముగఁ బోరాడుచుండఁ గొంతవడికి సౌభద్రునిగదాఘాతమ్ములచే దుశ్శాసనసూనుండు గతప్రాణుం డయ్యె. కమలాకరమునఁ జొచ్చిన వనగజమును నిర్దయులైన కిరాతులు చుట్టుముట్టి కడతేర్చునట్టులా సమయమ్మున నచ్చటి మహాయోధులెల్లరును గూడి నిర్దయులై తాముపన్నిన కృత్రిమవిధానంబున ననేకమహావీరప్రాణాపహరణచణుండైన యభిమన్యుని ప్రాణం బపహరించిరి.

క॥ పెక్కండ్రు గూడి యిమ్మెయి
నొక్కనిఁ జంపుట యధర్మమోహో యని న
ల్దిక్కులను బెద్దయెలుఁగున
నక్కజముగ భూతసంచయంబులు వలికెన్.

---

దశకుమారచరిత్రము.

## 3. రాజవాహనజననము.

[కేతన—ఇతఁడు తిక్కనకు సమకాలికుఁడు. దశకుమారచరిత్రమును వ్రాసి తిక్కనసోమయాజి కంకితము జేసెను.]

---

వ॥ కుసుమపురంబు రాజధానిగా రాజహంసుండు మగధరాజ్యమును బరిపాలించుచుండె. అమ్మేదినీవల్లభునకుఁ

గులక్రమాగతులగు సుమతియు సుమిత్రుండును సుశ్రు
తుండును సుమంత్రుండును ననువారు నలువురును మం
త్రులై యుండిరి. వసుమతికి సవతియనందగు వసుమతీదేవి
యగ్రమహిషిగా రాజహంసుఁడు రాజ్యసుఖంబు లనుభ
వించుచుండ, మాళవదేశాధీశుండైన మానసారుండు రాజ్య
గర్వంబున మిన్నుమన్నుఁ గానక కయ్యంబునకుఁ గాలు
ద్రువ్వుచు నెగ్గు లొనర్చుచుండ నమ్మాగధుండు సైరణ
సేయఁజాలక రణంబునకుఁ బ్రయాణభేరి సఱవం బనిచిన.

మ॥ కులశైలంబులు దిర్దిరందిరుగ దిక్కుంభీంద్రవర్గంబు సం
చలతంజెంద వియత్తలంబు వగులన్ సర్వంసహాచక్ర మా
కులతం బొందఁగ సప్తసాగరములుం ఘూర్ణిల్ల లోకంబు ల
ల్లలనాడన్ జెలఁగెం బ్రయాణపటహంబత్యద్భుతాపాదియై.

క॥ భేరీభైరవభాంకృతి
దూరీకృతశత్రుఁడగుచుఁ దుహినాంశుకులా
ధారుఁడగు రాజహంస మ
హీరమణుఁడు దండువెడలె నెంతయు నలుకన్.

క॥ జలనిధులు నిట్టపొడవం
బ్రళయాంతకుఁ డవనిజనులపై నేచిన య
ట్లలఘుప్రకట చతుర్విధ
బలయుతుఁడై మానసారుపై వడి నడిచెన్.

వ॥ ఇట్లు వెడలిన రాజహంసుని దండయాత్రావృత్తాంతంబును జారముఖంబున విని మాళవేశ్వరుండు మహోగ్రతరాగ్రహావిగ్రహుండై నానాగజయూథఘోటకసనాథసమగ్రంబైన యనంతసేనాసముదయంబులతో సమరాభిలాషియై శత్రుసేనల కెదురుగఁ జనియె. ఇవ్విధంబున మాగధమాళవేశ్వరు లొండొరుల కెదురు నడచుచు నొక్కయెడం గలసికొని మొనలఁ దీర్చియుండిన సమయంబున.

క॥ కరిఘటలుఁ దురగచయములు
నరదంబులమొత్తములు భటానీకములున్
బెరసి దిగంతము లద్రువఁగఁ
బరువడి దలపడియె రెండువాగులయందున్.

క॥ కరికరములఁ దురగఖురో
త్కరముల రథచక్రములఁ బదాతులు పైపై
దిరుగుచుఁ దునియుచు నలియుచు
ధరణీభాగమునఁ బడిరి తెఱ[illegible]యుండన్.

క॥ కాలుబలమొల్ల నిమ్మొయిఁ
గాలునిబలమయ్యె నంతఁ గరితురగరథా
భీల త్రివిధబలంబులు
నాలంబున రౌద్రరసము నాకృతిచూపెఁ.

వ. తత్సమయంబున.

ఉ॥ ఆమగధేశ మాళవధ
రాధిపు లెక్కటిఁ బోరి రాజిలోఁ
గాముఁడు శంబరుండు శశి
ఖండధరుండు గజాసురేంద్రుఁడున్
రాముఁడు రావణుండు సుర
రాజతనూజుఁడు సింధునాథుఁడున్
భీముఁడు దుస్ససేనుఁడు ను
పేంద్రుఁడుఁ గంసుఁడుఁ బోరునాకృతిన్.

వ॥ ఇట్లతిఘోరయుద్ధంబుచేసి వసమఱియున్న మానసారుం జూచి కరికపోతంబుఁ గనిన కంఠీరవంబునుంబోలెఁ గోపించి పట్టుకొని యతని వదనంబు లజ్జావనతంబగుటఁ గనుంగొని కరుణించి యమ్మాళవేంద్రునిం దోడ్కొనిపోయి వాని రాజ్యంబునం బ్రతిష్ఠించి క్రమ్మఱివచ్చి రాజహంసధాత్రీపతి యప్రతిహతంబగు తన సంపద పొంపిరివోవ, లక్ష్మీకిం బాత్రంబుగా సుపుత్రుంబడయం గోరుచున్నయెడ నొక్కనాఁడు ప్రభాతసమయంబున రాజహంసుకోర్కికిం దగినట్లు దైవయోగంబునం జేసి వామదేవుండను మహర్షి వసుమతీదేవికి స్వప్నంబునఁ బ్రసన్నుండై సంతానసంపత్కరంబుగ సంతానవృక్ష ఫలంబొసంగి చనియె. ఆసుస్వప్నంబు సఫలంబగుటంజేసియద్దేవి గర్భంబు దాల్చినం బ్రమోదసంపదవలనఁ బొంపిరివోవుచు సమస్తసుహృద్భూపాల

వర్గంబు రావించి వసుమతీదేవికి సీమంతోత్సవంబొనరించి, మగధేశ్వరుండు విభవవిజితదేవేంద్రుండగుచు మంత్రి పురోహిత సామంతపరివారపరివృతుండై కొలువున్న యవసరంబునఁ బ్రతీహారి చనుదెంచి సవినయంబుగ నిట్లనియె.

క॥ దేవ! భవద్దర్శనసం
భావన లెదఁగోరి వచ్చి ప్రతిహారమునన్
దేవసముఁ డొకమునీంద్రుఁడు
దా వేడుకనున్నవాఁడు ధరణీనాథా!

క॥ అని విన్నవించి జనపతి
యనుమతమునఁ దోడితెచ్చె నా సన్న్యాసిన్
గని యెఱిఁగి మందహాసము
వినయముతోఁ గూర్చెఁ బతివివేకము వెలయన్.

ఉ॥ అంతఁ బయోజబంధుఁడు ది
నార్ధగతుం డగుటన్ సమస్తసా
మంతుల భృత్యులన్ బుధుల
మాన్యులఁ బొండని యా నృపాలుఁ డే
కాంతగృహంబులోనికిఁ బ్రియం
బున మంత్రులుఁ దానుఁ బోయి వే
షాంతరగూఢుఁడైన చరు నల్లనఁ
జేరఁగఁ బిల్చి యిట్లనున్.

"ఓరీ! నీతో వచ్చిన తక్కినచారు లెందుఁ బోయిరి. నీ వీసన్న్యాసివేషముతో నేయేపురంబుల నేయేరాజుల విశేషంబులఁ గనుగొంటివో మా కెఱింగింపు" మనుటయు నమ్మాయసన్న్యాసి తన మాఱువేసంబు దీసి సవినయంబుగ ని ట్లనియె. "దేవా! దేవర పంపిన గూఢచారులెల్లరు నొక్కొక్క రొక్కొక్కదేశంబునకుం జన నే నీవేసమ్మునతో మాళవదేశంబునకుఁ బోయితి. అందుఁ గొన్ని దినంబులు నిగూఢంబుగ వర్తించి యా రాజువర్తనంబులు గుర్తించి వచ్చితి. మాళవేశ్వరుండు మున్నుసంగ్రామంబునఁ బరాజితుండై దేవరచే నిజరాజ్యంబున నిలుపంబడిన నాటంగోలెఁ బరాభవానలంబునఁ గ్రాగుచు నీశ్వరునిం గూర్చి యుగ్రతపంబుఁ గావించె. ఆతని తపఃప్రభావంబునకు దేవదేవుండు మెచ్చి శత్రుభయదంబగు నొక్కపెనుగద యిచ్చి చనియె. మానసారుండు కృతఘ్నుండై యుగ్గదాయుధంబె యాధారంబుగ దేవరపైఁ జనుదేరఁగ నున్నవాఁడు. ఇంక మీఁదికార్యం బెడసేయక యోజింపందగు"

చ॥ అని యెఱిఁగించి వాఁ డరుగ
నప్పుడె కార్యము నిశ్చయించి యి
ట్లనిరి తగంగ మంత్రులు న
రాధిప! యిట్టిద యేని మాళవేం

దుర్గిని కెదురెత్తరాదతఁడు
రోషమునంబయి నెత్తివచ్చినన్,
జెనయుట దక్క దుర్గములు
చేరుట నీతి తలంచి చూడఁగన్॥

వ॥ అని దైవబలంబు విచారించి పలికిన మంత్రులకుఁ బతి యిట్లనియె.

మ॥ మగపంతంబున మానసారుఁ డనిలో
మా కల్గి పైనెత్తినన్,
బగ వాటింపక వాని నోంపక జగ
త్ప్రఖ్యాతిగా నోటమై
దగవూహింపక దుర్గభూములకు నిం
దాపాత్రమైపోక బు
ద్ధిగఁ జెప్పఁదగునే స్వచుప్రకృతి ని
స్తేజంబు పైరింపనే ?"

ఉ॥ దైవబలం బసాధ్యమని ధైర్యముఁ బెద్దటికంబు లజ్జయున్
బోవఁగఁ బెట్టి కోటలకు, బోయినలోకమువారు నవ్వరే?
యేవపుమాటలేమిటికి నెల్లవిధంబుల మానసారుపైఁ
బోవుటమాన, వాఁ డనికిఁ బూని నిజంబుగ నెత్తివచ్చినన్.

వ॥ అనినఁ బతిపలుకు లతిక్రమింప నేరక యొడంబడి వీడ్కొని నిజనివాసంబులకుం జనిరి. మఱునాఁడు మాళ వేశ్వరుండు సమస్తసామగ్రితో నెత్తివచ్చిన విని సుమతి

ప్రముఖులగు నలువురు మంత్రులు గార్యజలంబు సాధనంబుగా నధిపుచిత్తంబు మెత్తంజేసి హేతుదృష్టాంతంబులు చూపి యొడంబఱిచి గర్భభారాలసాంగి యైన మహాదేవి నఖిలాంతఃపురసంతానంబుఁ గూర్చి బుద్ధిసహాయంబుగా ధాత్రీవర్గంబును క్రీడాసహాయంబుగా సఖీవర్గంబును మార్గస్ఖలవర్తనసహాయంబుగా మూలబలంబును సమర్పించి వింధ్యాటవీమధ్య నిగూఢంబుగా నిలువ నియమించి కందువచెప్పి యనిచి పుచ్చిరి. రాజహంసుండును దండువెడలె. ఇట్లొండొరులు చేరవిడిసినంత మగధమాళవాధిపుల బలంబులు తలపడియె. అతి స్వల్పకాలంబుననె యాపోరు ఘోరంబగుటయు మానసారుండు విజయాతురుండై భవదత్తంబగు మహాగద వైచిన మగధవల్లభుండద్దానిం దునియలొనర్చె. అట్లయ్యు నయ్యది దైవదత్తంబగుట నమోఘంబు గావున నగ్గదాఖండంబులు రాజహంసు సూతుం దాకి వానిం గడతేర్చి రాజహంసు మేనం గాడి మూర్ఛితుం జేసె. సారథిలేమిం జేసి రథ్యంబులుభయభ్రాంతంబులై పఱుగిడుచుంబోయి దైవవశమున వింధ్యాటవిం బ్రవేశించి యంతఃపుర సన్నివేశంబున కనతిదూరంబున నొక్కవటవిటపికి నరదంబు తగులుటచే నచ్చటం బరిశ్రాంతంబులై నిశ్చలంబులై యుండె. ఆరథంబున రాజహంసుండును సేదదేరియుండ, నట మాళవేశ్వరుం

డును మగధపతిరాజ్యంబు గైకొని కుసుమపురంబునకుం జనియె.

సుమతిప్రముఖులైన మంత్రులెల్లరుఁ బాలికలనంబడియుఁ గ్రమ్మఱఁ దెలిసి భూవల్లభు నన్వేషించి యెందు నుంగానక వింధ్యాటవికిం బోయి కాంతాజనంబును సమీపించి వసుమతీమహాదేవింగని యుద్ధప్రకారంబును రాజహంసునిం గలనిలోఁ గోల్పోయినయిట్టి సవిషాదంబుగా నెఱింగించిన నిజవల్లభుండు పరలోకగతుం డయ్యెనకాఁ దలంచి యద్దేవి శోకంబు సైరింపఁజాలక తనుత్యాగంబునకు నుద్యోగించి యనలంబు దయసేయుఁ డనిన మంత్రు లిట్లనిరి. సంశయంబగు పతిమరణంబున కనుమరణంబు తగదదియునుంగాక నీ స్వప్నఫలంబు సాకారంబైనట్లున్న నీ గర్భంబు రక్షించుటయె సమస్తలోకరక్షణంబగు. మఱియు.

మ॥ ఉదరస్థుండు సుతుండు, వాఁడగు జిరా
యుర్ధీ యశస్స్ఫూర్తిమా
ర్య దయా ధైర్యపరాక్రమంబుల జనా
రాధ్యుండు లోకత్రయీ
హృదయాహ్లాదకరుండు నిక్క మని ని
న్నేకాంతదుర్గంబులోఁ

బ్రిదికింపన్ మదిఁగోరె భర్త, యది
తప్పం జూడఁగాఁ బాడియే?

వ॥ వసుమతీదేవియు వారితో వాదింప నొల్లక యప్పటికి వల్లెయని, యర్ధరాత్రమున నందఱు నిద్రాపరాధీనులై యుండ సముత్థశోకానలంబు సైరింపఁజాలక యచ్చోటు వాసిపోయి వరుని యరదంబు చిక్కిన వటవిటపి సమీపంబున నొక మ్రానికొమ్మ నుద్బంధనంబు సేసికొన నెంచి 'హా! మగధేశ్వరా! రాజహంసమహీవల్లభా! భావిజన్మంబులయందు నేన నీకు ధర్మచారిణినైయుండుదాన' ననుచు నాక్రందనంబుఁ గావింప నంతకుమున్న మిళితనీహారంబైన మారుతంబు సోకునం దెప్పిఱియు బహువ్రణపరిస్రుతశోణితులై లావరుటం జేసి లేవఁజాలక యున్న భూవల్లభుం డాశోకధ్వని విని, తనసతి చావునకుం దెగుట భావించి 'వలదు వలదు. సాహసంబు వల' దని యెట్టులేనియుం బలికె. ఆపలుకులకు వసుమతి యులుకుఁ వడిచీకటిలో నయ్యెలుంగుదిక్కుఁజూచి పతికంఠస్వరంబుగ గుర్తించి పోయి రథంబుపైనున్న రాజహంసుంజూచి సంభ్రమించి, పరిజనుల కెల్లర కెఱింగింప సచివప్రముఖులెల్లరు వచ్చిచూచి యానందరసాబ్ధి నోలలాడిరి. అనంతర మమ్మంత్రులు జనపతినెత్తి తెచ్చి మృదుశయ్యపై నుంచి తనుసక్తశల్యంబులం బుచ్చి సుఖస్థితుం జేసిరి. "దేవా! పరివా

రంబులు లేక చీకటి నొంటరిగ నిట్లేలవచ్చితి” రని యెల్ల వారు నడుగసాగిరి.

చ॥ అనిన మహీశుఁ డిట్లనియె
నాలము లోపల మాళవుండు నై
చినగదఁ జూర్ణితాకృతిగఁ
జేసితిఁ దీవ్రశరంబు లేసి య
త్తునియలు వచ్చి సూతు వెసఁ
ద్రుంచి మదంగము లెల్ల నొంచినన్
మనమరి మూర్ఛఁబోయితిఁ గ్ర
మంబున నియ్యెడ సేదదేఱితిన్॥

క॥ తేటినయవసరమున నీ
కాటడవిం గాంత యెలుఁగు కరుణాస్పదమై
మీాటి చెవిసోఁకుటయు నడ
లాటఁగ నేఁ బలికితిం బ్రియత్నముతోడన్.

సీ॥ అరుగుదెంచిన తెఱఁ గిట్టిదని యెఱుంగ
ననిన మంత్రులుఁ గాంతలు నా ప్రజనులు
నఘటమానవిధాయకుఁ డగు విధాతఁ
బొగడి రానంద మాత్మ నుప్పొంగుచుండ.

వ॥ కతిపయదినంబుల కమ్మహీనాథు శరీరవ్రణక్లేశంబుం బా
మనఃక్లేశంబునుం బాప నెంచి మంత్రులతని కిట్లనిరి.

శా॥ దేవా! మున్ను సమస్తభూపతులతోఁ
దేజోగరిష్ఠుండవై
యీ వింధ్యాచలమధ్యకాననమునం
దిబ్భంగి నీ యున్కియుᳲ
దైవాధీనముగాన దీనికి విషా
దం బందఁగా నేల? శ్రీయుం
భోవాహంబులయట్లు సంపద లొగిం
బుట్టుం జెడుᳲ మాత్రలోᳲ.

వ॥ అని పెక్కు భంగుల బోధించి, పదంపడి సుమతిప్రముఖులు జనపతితోడను, దత్కుటుంబంబుతోడను, సమస్త పరివారంబులతోడను వామదేవుం డను మునివరు నాశ్రమంబునకుం బోయి యందుఁ గొండొకకాలంబు నిలిచి యుండ నిజమనోరథం బమ్మహాముని వలన సఫలంబుఁ గావించుకొనందలంచి విభుండు వినయావనతవదనుండై వామదేవున కిట్లనియె.

చ॥ తప మొనరించి మాళవుఁడు
దైవబలంబున నన్ను నోర్చి రా
జ్యపదవిఁ దాను గైకొనియె;
నట్లన యేనును బూని చాలను
గ్రపుఁ దపమాచరించి రిపు
గర్వ మడంపఁ దలంచి, నేను నీ

క్రృపఁ బడయఁగవచ్చితి న
కిల్బిషమానస! తాపసోత్తమా.

వ॥ అనినఁ గాలవుని యగుటంజేసి భావిఫలం బెఱింగింపం దలంచి వాసుదేవుం డిట్లనియె.

క॥ ఆయానంబునఁ దపములు
సేయంగా నేల? శత్రుజిద్బాహుండా దీ
ర్ఘాయుష్మంతుఁడు పుట్టెడు
శ్రీయుతుఁ డగుసుతుఁడు వసుమతీగర్భమునన్.

వ॥ అని యిట్లు చెప్పు నవసరంబున "మునివాక్యంబునందు సంశయంబువలదు. వసుమతికి జన్మించిన పుత్రుండు సంప్రాప్తయౌవనుండగుడు దిగ్విజయార్థం బరుగవలయు. అది నీ కభ్యుదయనిమిత్తం" బని యశరీరవాణి యంతరిక్షంబున నేతెంచిన ధరణీశ్వరుండు పరమానందంబునం బొంది యున్నఁ గొన్నిదినంబులకు శుభముహూర్తంబున నద్దేవికి సర్వలక్షణలక్షితాంగుం డగు పుత్రుం డుదయించి జాతకర్మాదిసంస్కారంబులఁ బ్రదీప్తుండై రాజవాహనుం డన దినదినప్రవర్ధమానుఁ డగుచు నుండె.

---

నృసింహపురాణము.

# 4 జయవిజయశాపము

[ఎఱ్ఱాప్రెగడ - వీనియింటిపేరు ఏర్చూరివారు. నివాసస్థలము నెల్లూరు మండలమునందలి గుడ్లూరు. నియోగిబ్రాహ్మణుఁడు. వీనికి శంభుదాసను నామాంతరముగూడఁగలదు. క్రీశ-1340 మొదలు 1369 వఱకుఁ దెనుఁగుదేశములో రాజ్యముచేసిన యనవేమారెడ్డి కెఱ్ఱాప్రెగడ యాస్థానకవిగా నుండెను. ఇతఁడు శిథిలమైన భారతారణ్యపర్వశేషమును బూరించి, రామాయణమును, నృసింహపురాణమును హరివంశమును వ్రాసెను. వీనికిఁ బ్రబంధపరమేశ్వరుఁడను బిరుదు కలదు.]

---

వ॥ మహనీయమహిమాభిరామం బగు క్షీరపారావారము నిరంతరము శ్రీమన్నారాయణునకు శయనాగారంబై విరాజిల్లుచుండు. అదియే భువనైకమాతయగు రమాదేవికిఁ బుట్టినిల్లు. చంద్రుండును నైరావణాది మహాకరులును మందారపారిజాతాది సురమహీజాతములును దుగ్ధాంబునిధియందే యుద్భవించినవి.

సీ॥ సిరిపుట్టినిల్లు రాజీవలోచనుసెజ్జ
పట్టు మహీకాంత కట్టుచీర
గిరులుడాగెడు గొంది గిరిభేది పగఱకుఁ
బలుకోట బడబాగ్ని బ్రదుకుఁజోటుఁ

పటుపయోధరముల పాలి ప్రపాసీమ
యమృతాంశుపొడుపున కనుగలంబు
మర్యాదలకు గుఱి మహిమలకందువ
యఖిలరత్నములకు నాకరంబు
సుఖదభవనంబు వాహినీసుందరులకుఁ
గూర్మి నిల్కడ గంభీరగుణము నెలవు
తనరు నొప్పిదముల కెల్లఁ దానకంబు
వనధిఁ గొనియాడఁ జతురాననునకు వశమె.

వ. ఇట్లపారవిభవోదారం బగు దుగ్ధపారావారంబునకు నలంకారంబగుచుఁ దదీయమధ్యప్రదేశంబున ననేకశతసహస్రకోటియోజనవిస్తారవిపులరూపంబై శ్వేతద్వీపంబుదీపించుచుండు. ఆశ్వేతద్వీపంబునందలివారలెల్లరు శరత్కాలజీమూతబహుళధవళాకారులు, జరామరణభయవిరహితులు, సంతతశ్రీహరిధ్యానానందచేతస్కులు. అట్టి మహాద్వీపంబు నడుమ వైకుంఠనామధేయంబగు మహాపురంబు భూరిమహిమాభిరామం బగుచుండు.

క॥ నాలుగునోళులవానికి
నాలుక లిరువేలుగల ఘనస్థిరమతికిఁ
బోలునె వినుతింపఁగ ననఁ
జాలికలకు మిగిలియొప్పుఁ బురియొప్పిదముల్॥

సీ॥ నారాయణునిదివ్యనామసంకీర్తనం
బనిశంబుసేయు మహాత్ములకును
బద్మాక్షు శ్రీపాదపద్మంబు లత్యంత
భక్తిమైఁ బూజించు ప్రాజ్ఞులకును
విశ్వరూపునిమూర్తివిభవంబు నేకాగ్ర
బుద్ధి భావించు సత్పురుషులకును
లక్ష్మీశ్వరుని సముల్లాసహేతువులగు
వ్రతములు సలుపు సద్వర్తనులకు
భవముదీఱిన తుది వచ్చి భవ్యసుఖము
లనుభవింపంగఁ దగునెల వగుటఁజేసి
అఖిలవస్తుసంపదలకు నాకరంబు
గుణవిధావిభాసురము వైకుంఠపురము.

వ॥ అట్టి వైకుంఠపురంబున రాకాచంద్రసహస్రభాసమానం బగు నొకదివ్యసౌధంబునఁ గమలాలయ యిల్లాలుగ, నలినాసనుండు నందనుండుగ, విహగాధినాథుండు వాహనంబుగ, నహికులస్వామి శయనంబుగ, నందకంబు గరవాలంబుగఁ, బాంచజన్యంబు శంఖంబుగ, నింద్రాదిదేవతలు సేవకులుగ, మునిగణంబు లాశ్రితగణంబులుగ, ధర్మసంస్థాపనంబె నిజోద్యోగంబుగ నార్తరక్షాపరాయణుం డగు నారాయణుండు నివసించుచుండు. ఆదేవుని దివ్యమహిమంబు లాదేవుండు తానె యెఱుంగుంగాని చతుర్ముఖ

పురందరప్రముఖబృందారకుల కెవ్వరికి నెఱుంగరాదు. తపంబులం బోని పాపంబులు దానంబులం దొలంగని దోషంబులు జపంబులం బాయని కలుషంబులును వైకుంఠవాసుని పవిత్రనామం బొక్కమా ఱచ్చంపుఁ దలంపున నుచ్చరించిన మాత్రనఁ జెచ్చెర విచ్చిపోవు. అనన్యాది దేవునకుఁ గరుణయె దివ్యాభరణంబు. ఆశ్రితసంతోషంబె మహైశ్వర్యంబు. భక్తసంరక్షణంబె ముఖ్యకార్యభరంబు. ఇట్టి పరమేశ్వరుండు పరమప్రభావసంభృతుండగుచు, భువనాహితచరితంబులం బాపుచు శుభంబులం జూపుచు భక్తజనపారిజాతం బనఁ బ్రఖ్యాతియుఁ గరుణారసప్రీతియుఁ దనకు సహజంబులై వెలయ వైకుంఠపురంబున విహరించుచు సకలలోకాలంకారంబగు శరత్కాలంబునం దొక్కనాఁడు మందస్మితసుందరవదనారవిందుండై యిందిరతోడ సరససల్లాపసౌహార్దంబునం దవిలి.

ఉ॥ ఆ నలినాయతాక్షి నయనాంచలచంచలతానవిభ్రమ
భ్రూనటనంబు నాథునిపూర్ణముఖేందువిలాసహాస మ
మ్యాసిని ముగ్ధభాషణసమంచితమంజులలీల యెంతయున్
మానసముం బ్రమోదరససమగ్రముగా నొనరింపనున్నెడన్.

క. డెందమునఁ గొలువువేడ్కలు
సందడిగొన నేగుదెంచి సంయమివరులున్

బృందారకులున్ నిల్చిరి
క్రిందుగ జగదీశు మందిరద్వారమునన్.

సీ॥ అవసరం బిప్పుడయగు నంతదాఁకను
బగళస్సై నిలుఁడు దిక్పాలవరులు
సందడిసేయక యందఱు నించుక
సేపుగూర్చుండుఁడు సిద్ధమునులు
దండియలును మీరు దడియంగఁ బడక యం
తకు నటువోండు గంధర్వముఖ్యు
లిందాఁకఁ బాగడితిరించుక వడి యింక
జగడంబు మానుఁడు చారణేంద్రు
లనుచు నుద్వృత వేత్రదండాభిరామ
హస్తులై ఫణిహారు లందంద నిలువ
నధికమై యొప్పె సమ్మర్ద మాదిదేవు
భూరిమందిరతోరణభూమియందు.

వ॥ అట్టి సంకులసమయంబున బ్రహ్మకుమారులగు సనకుఁడు సనందనుండును సనత్కుమారుఁడు సనత్సుజాతుండు నను వారలు గోవిందసందర్శనవాంఛ నేతెంచి యనివార్యగమనంబున లోనికిఁ బోవం బోవ వారికి నడ్డపడి జయుండును విజయుండు నను ద్వారపాలకు లమ్మహామునీంద్రుల కిట్లనిరి.

ఉ॥ ఇప్పుడె మేలుకాంచెఁ బర
మేశుఁడు సాగరకన్యకాంతతోఁ

దెప్పలఁ దేలుచున్న తన
తియ్యపుఁజూపులనేని నొందుమైఁ
ద్రిప్పఁడు పాఁపపాన్పపయి
దివ్యపదంబు పసిండిపావయం
దొప్పగ నేని మోపఁడట
నొండ్లను జేరరు పూని యెవ్వరున్.

క॥ ఈసిద్ధ లీసురప్రభు
లీసంయమివరులు జగదధీశ్వరుఁ గొలువం
గా సమయము గాచి తదే
కాసక్తత నున్నచంద మటు గనుఁగొనుఁడీ॥

క॥ మీరును నొక్కింతతడవు
సైరణతో నిలిచి సమయసముచితముగ ల
క్ష్మీరమణుఁ గని కృతార్థస
మారంభుల రగుఁడు తద్దయాలాపములన్.

వ॥ అని వారించినంత ముకుందసందర్శనోత్సాహంబునకు భంగంబు వాటించిన జయవిజయుల నత్యాగ్రహదృష్టులం జూచి.

సీ॥ అఖిలలోకగమ్యుఁ డగుపరమేశ్వరుఁ
జూడఁగొల్వ నబ్బు సుకృతమునకు
నంతరాయమైతి రట్టి యుద్ధురితంబు
ఫలము ననుభవింపవలయు మీరు.

ఉ॥ కావున ధర్మవిద్విషులు
కల్మషకారు లనంగ దుష్టమా
యావిలబుద్ధితో నసుర
లై చరియింపుఁడు సంతతంబు ల
క్ష్మీవిభుమీఁది మచ్చరముఁ
గిక్కయుఁగాఁటియ పెట్టుఁగాత మీ
భావము లెప్పు డీపగిది
బాములఁ బెక్కగు నిక్కమెంతయున్.

వ॥ అని ఘోరంబుగా శపించిరి. జయవిజయులును భయాతి
శయంబున మూర్ఛిల్లి తెలిసి వెఱఁగుపడి వెలవెలఁబోవం
జొచ్చిరి. అచ్చటఁ గూడియున్న మునిబృందారకు లెల్ల
నిరంతరశాంతస్వాంతులగు సనకాదుల కింతటి యాగ్రహం
బేల యయ్యెనో యని చింతపడసాగిరి. ఆ వృత్తాంతం
బంతయుఁ దన దివ్యచిత్తంబున నవధరించి సకలజగన్నివా
సుం డగు వాసుదేవుండు లక్ష్మీసహితంబుగ ససంభ్రమం
బున నచ్చోటికి విజయంచేసి సనకాదులం జూచి, మీరు
సకలలోకద్వారంబుల నిర్వారితసంచారులరు. అట్టి మీకు
వీరుచేసిన తప్పు వాయది. ఉపశమంబు నొందుం డని
యనునయించిన నయ్యోగీశ్వరులు మహాయోగీశ్వరే
శ్వరుండైన లక్ష్మీశ్వరుసందర్శనంబును సంభాషణం
బును గని కృతార్థులై పరమానందంబునఁ దదామంత్రి

ణంబు పడసి నిజేచ్ఛం జనిరి. అంత నారాయణుండు బహుల కారుణ్యపుణ్యావలోకనంబుల జయవిజయుల నీక్షించుచు దరహాసప్రసాద సాదరవదనుం డగుచు నిట్లనియె. "మునులకోపంబునకు మీయుకోపంబు సూపకయున్న మీశాంతంబు గొనియాడందగినది. బ్రాహ్మణవచనాతిక్రమణం బొనర్పక మీరు జన్మాంతరంబులు గైకొనవలయు. మీరు చిరకాలంబు నన్ను భజియించిన దాసులగుటంజేసి పరమైశ్వర్యభాజనంబులగు జన్మంబులం దేహవిభవంబులనుభవించి తుది నన్ను సాన్నిధ్యంబు నొందఁగలవారలు. మీ యంతరంగంబులఁ గలంకిఁ బొలంగుఁడు. మఱియు శరణాగతుల రగుటంజేసి మీ కెందును శుభంబ. సకలచరాచర జనకుండైన కశ్యప మహామునీంద్రుండును దక్షకన్యా వరేణ్యయగు దితియును [illegible] భవదుద్భవకారణ్య బయ్యెదరు. ప్రహ్లాదవిరోచనబలిప్రముఖులగు భాగవతోత్తములు భవదీయవంశంబునం బరమపావనులై యుదయించెదరు." అని వారలకు సెలవిచ్చి గోవిందుండు నిజదర్శనార్థులగు సురమునిప్రముఖములకుఁ బేరోలగం బిచ్చి కృతార్థులంజేసి నిఖిలజగంబులు రక్షించుచుండె.

---

ఉత్తరహరివంశము.

# 5 మృతవిప్రకుమారరక్షణము

[సోమనాథుఁడు:—వీనియింటిపేరు నాచనవారు. నెల్లూరుమండలవాస్తవ్యుఁడు. నియోగి. 14 వ శతాబ్దాంతమునందలివాఁడు. ఇంచుమించుగ నెఱ్ఱాప్రెగడకు సమకాలికుఁడని చెప్పవచ్చును. ఇతఁ డుత్తరహరివంశమును రచించెను.]

---

వ॥ ద్వారకానగరంబునం దొక్కనాఁడు శ్రీకృష్ణుఁడు విధ్యుక్తంబగు నొక్కక్రతు వాచరింపఁ దొడంగె. ఆనాఁడు గోవిందుఁడు బంధుమిత్రపరివారంబులు బలసి కొలువ, క్రతుదీక్షయం దుండ, మూర్తీభవించిన శోకదేవతంబోలె నొకవిప్రుఁడు.

క॥ వెడవీడెడు దోవతియును
బెడతలచేతులు వడంకుపెదవులు వ్రేలా
డెడు వెండ్రుకలును బైపై
వెడలెడు కన్నీరుగలుగు వేషముతోడన్.

క॥ ముందట నిలిచి మురాంతక!
మందరధర! భక్తలోకమందార! దయా
కందళితహృదయ! సురవర
వందితపాదారవింద! వసుదేవసుతా!

వ॥ దేవదేవా! నన్ను రక్షింపుము రక్షింపు మని మొఱలిడుచు వచ్చెను. కృష్ణుఁడు వాని యాక్రందనము విని సాదరం బుగ నూరార్చుచు నమ్మహీదేవున కిట్లనియె.

క॥ ఏలయ్య భూసురోత్తమ!
తూలెదు? నీయట్టివారు దుఃఖాంబుధిలోఁ
దేలుదురే? మముబోంట్లకుఁ
దాలిమి లేకున్నఁ దెలుపఁదగువారయ్యా.

క॥ మేలుం గీడును వచ్చుఁగా
గాలముతో రెంటిచేతఁ గలఁగరు ధీరుల్
తేలుచు మునుఁగుచు నితరులు
జాలింబడుదురు వివేకసంగతి లేమిన్॥

వ. అనుటయు నవ్వాసుదేవునకు భూసురోత్తముఁ డిట్లనియె. "పురుషోత్తమా! ఎట్లు ప్రలాపింపక యుండువాఁడ ? విధి నాయందుఁ జలంబు వహించి చూపోపక ప్రసూతిదినంబు లనే నాపాపల మువ్వుర నపహరించె నాకళత్రం బిప్పుడు మఱల గర్భవతియై నవమాసంబులు నిండియున్నది. నా గుండెయుఁ బగులుచున్నయది. దేవా! నీ వీగర్భమును రక్షించి లోకవినోదార్థమీసంతానఫలంబును జవిచూచు భాగ్యంబుగలిగించి మమ్ము రక్షింపుము. నేఁడు తప్పక ప్రస వంబు కాఁగలదు.

సీ॥ తడియొత్తు చీరతో దాదికౌఁగిటఁ జేర్చి
చూపంగఁ గన్నారఁ జూడనైతిఁ
దడవియాడకమున్న తట్టిడు మని పట్టి
వడకంగ సెజ్జపై వ్రాల్చనైతి
నల్లంతదవ్వుల నప్పులప్పల యని
యెదురుగాఁ బఱతేర నేగనైతి
వియ్యాలచే నిచ్చి వేడుక నను వారు
తిట్టింప విని దప్పిదేరనైతి
నకట! మిథ్యామనోరథుండనైతి గాని
కొడుకులం గని దమవారు గొండసేయ
నుండ లేదయ్యె సంపద లుబ్బనేని
లేబరముగాదె బిడ్డలు లేని బ్రతుకు.
క॥ ఈగర్భము రక్షించిన
నాగౌరవ మేమిచెడక నారాయణ! నా
నాగుణసంపన్నులలో
సాగుదు నటుగాకయున్న సవయుదు వగలన్.
వ॥ అనవుడు గోవిందుండు దరహాసితవదనుండై "భూసు రోత్తమా! నేఁ డొక్కదినంబ నీవు నన్ను మన్నింప వలయు. క్రతుదీక్షితుండనై యున్నవాఁడ. రేపకడ తప్పక రాఁగలవాఁడ. ఎల్లవిధంబుల నీ తనయునిం గాపాడఁ గలవాఁడ" నని పలికె. అంత నార్తుం డగు నవ్విప్రుండు

దీనాననుండై, "గదాధరా! నేఁడు ప్రసూతికాలంబున నీవు మద్గృహంబునఁ జక్రహస్తుండవై యుండి దండధరు బారినుండి నాసంతతిం గాచి ననుఁ బుణ్యుం జేసినంగాని యెట్టి కార్యంబు మీఱిన నేమిచేసెదవు? నేఁడుఁ దప్పినఁ గార్యంబును దప్పును" అని కంట నీరువెట్టి వగచుచుండ జేరువనున్న యర్జునుండు "బావా! వసుధామరుప్రార్థన దీర్ప ననుఁ బనుపుము. పనివినియెద" నని పలికె. విశ్వంభరుం డల్లన నవ్వుచు, "విజయా! నీచేతను నాచేతను నెట్టి కార్యంబైనం జక్కఁబడు. కాని యీ విప్రకార్యము మాత్రము నీ పంతంబులం గొనసాగనేర" దనఁ గిరీటి వినయలజ్జాయత్తచిత్తుండై మోమర వాంచి యూరకుండె. అప్పుడు వాసుదేవుండు ధరణీదేవుని దీనభావంబును నర్జునుని లజ్జాభావంబును భావించి, "పురందరపుత్రా! నీ వింక విప్రసుతరక్షణార్థంబు వెడలుము. బలరాముఁడును బ్రద్యుమ్నుఁడును దక్క మన వీటంగల తక్కిన యోధుల నెల్లరం గూర్చుకొనుము. వేవేగ లెమ్ము" నావుడు పార్థుఁడు ముఖంబు వికసింప, యదువృష్ణ్యంధక భోజప్రముఖసైన్యంబులతో దిగంతద్విపమండలంబు బెగడువడ గాండీవగుణాస్ఫాలనంబుఁ గావించుచు శ్రీకృష్ణ పదాంబుజంబుల హృదయంబున నిలిపి వెడలిపోయి విప్ర మందిరంబునఁ బ్రవేశించి యముని యాగమనంబును నిరీక్షించుచుండెను. అప్పుడు.

క॥ ఎఱసంజ దాసనంబుల
తెఱఁగయ్యెను గూబలెల్లఁ దెసలఁ జెలంగెన్
వఱదు లఱచె నుల్కాలువడె
నెఱిచెడి సురగాలి విసరె నిలువక పెలుచన్.

వ॥ సైన్యంబును గట్టాయితంబుసేసి వాసవనందనుండు నభోంతరాళముల శింజినీనాదమున నించుచు నమ్మహీదేవుని గృహాంగణంబున క్షణక్షణంబును నంతకునిరాక ప్రతీక్షించుచు నుండు నెడఁ గొంతవడికి లెండు లెండు "పట్టుఁడు! పట్టుఁడు! పొండు పొం"డనుమాటలు భయదస్వనంబుతో వానికి వినవచ్చె. వినవచ్చుటయె తడవుగ "అయ్యయ్యో! పండినపంట మఱలఁ బొల్లవోయిన"దని గృహాభ్యంతరమునుండి బ్రాహ్మణియాక్రందనధ్వానమును నర్జునుండు వినియె. దానంజేసి బ్రాహ్మణికి శిశు వుద్భవించినట్లును మరణించినట్లును విజయుండు గ్రహించి వచ్చిన యమకింకరప్రకరంబును గానలేమికి మిక్కిలి చింతించె. ఇట్లు బ్రాహ్మణశిశుప్రాణములు పోయినంతనె యదువృష్ణిభోజబలంబులును జిన్నవోయెను. వచ్చిన బంధులు మృతశిశువుం జూచి పోయిరి. అర్జునుండును లజ్జవోయెను. ఇవ్విధంబున గాండివమ్ములావు నమ్మియునం గ్రమ్ము నుమ్మలికమ్మున విన్నవోయియున్న సంక్రందననందనుం జూచి విప్రుఁడు బోరన నేడ్చుచు.

క॥ ఓ పార్థ! నిన్ను నమ్మితిఁ
బాపని రక్షింపకిట్లు పాఱుఁడవైతే?
నాపాలిపారిజాతము
గోపాలకచక్రవర్తిఁ గొనిరా నైతిన్.

చ॥ పిలిచితి నన్న నిన్ను నతిభీతుఁడ
విప్రుఁడ నమ్మినాఁడ నీ
పలు కనృతంబుగాఁదగునె
పాఱెడుబంట్లకుఁ గాళ్ళుసాఁపగా
నలువడు నన్న పోటుమగఁడై
యిటు చేసితిగాక యాసతో
నిలుతు మురారి నన్నచట
నీళ్ళను ముంచినఁ బాల ముంచినన్.

క॥ మేలైనను గీఁడైనను
నాలవపాలాఫలము ధనంజయ! రక్షా
శీలునకుఁ జేరు నీ వీ
బాలుని రక్షింపనట్లు ఫలముందుదుగా.

క॥ నీ వేమిసేయు దీగాం
డీవము నీ కిచ్చి యమ్ము లెప్పరమైనన్
లావు గలదంచు బలికిన
పావకుచేఁ గాదె గోలుపడితిఁ గుమారున్॥

వ. అని కడునిష్ఠురముగఁ బలికెను. అర్జునుం డవనతముఖుండై మౌనమును దాల్చి విప్రుిండును దనతో నరుగు దేరఁ దేర గాండీవము నిడి లజ్జాయత్తంబగు చిత్తంబుతో సైన్యసమేతంబుగ ద్వారకకుం బోయి విషాదనమ్రివదనుండై నారాయణునెదుట నిలిచె. అట్టి యన్న మఱందిని వెన్నుం డల్లన గారవించి, యవ్విప్రికులోత్తము నెంతయు బుజ్జగించి, "అయ్యా! నీ కుమారకుల నేలోకంబునం దున్నను దెచ్చియిచ్చెద. నీవు కొందలంపడఁ బనిలేదు. నీవు ధైర్యంబునం దుండు" మని పీతాంబరధరుండు సముచితాభరణధరుండై శార్ఙ్గకౌమోదకీచక్రనందకాదిప్రహరణంబులు తనయరదంబుపైఁ బెట్టించి, గరుడధ్వజంబు మెఱయ దారకుం బొమ్మని సారథిత్వం బర్జునున కొసంగి కృతవలాహకసైన్యసుగ్రీవమేఘపుష్పసన్నాహముగు స్యందనంబున విప్రిసమేతంబుగ నధివసించి వెడలె.

ఇవ్విధంబున వాసవనందనుఁడు తేరు గడప వసుదేవనందనుఁడు వెడలి, హంససందోహసంధిహ్యమానకుముదదళాళిందకళిందనందనీసందర్శనంబువలనను, భ్రిమరవిభ్రమభ్రమణభాసురభాగీరథీలోకనంబువలనను మనంబు రంజిల్ల మచల్లకంబు మట్టి, మ్లేచ్ఛంబు మెట్టి, దరదంబు దాఁటి, కాశ్మీరంబు గడచి, సైంధవం బధిసంధించి, నారదంబు పరిభ్రమించి, హిమాచలం బెక్కి, హేమకూ

టంబుఁ దొ్రిక్కి, నిషధం బతిక్రమించి, నిమిషంబున దంత పరిఘద్విపఖండితదేవదారువును మేరువును గడిసి, వర్షాచలంబును గడిచి, మఱియు నెడనెడంగల విపినంబులు నదులు నగంబులు నన్నియును దాటి, యుద్యత్తరంగనాకలోలాకరం బగు రత్నాకరంబును గాంచిరి. అంత,

గీ॥ అతఁడు నెదురుగ వచ్చి మురాంతకునకు
నర్ఘ్య మిచ్చి 'లోకేశ! నా కానతిమ్ము
చేయఁగల కార్య' మనుటయు, 'సింధురాజ!
తెరువు విడుము నా కుత్తర దిక్కు' కనియె.

ఉ॥ నావుడుఁ గంసవైరికిఁ బ్ర
ణామము చేసి పయోధి యిట్లనున్
'దేవ! భవన్నియోగమునఁ
దేకువఁదప్ప దొకండు నాపయిం
బోవఁగ లేఁడు గాల్నడ వి
భుండగు నీవు చనంగ నెంతయున్
దోవయగున్ సమాశ్రితుఁడు
దూలిన నెవ్వగ నీకుఁ బుట్టదే?'

గీ॥ అనుడు 'విప్రకై నాకు నరుగవలసి
తోవ వేడితి మఱి నిన్ను దేవతలకుఁ
దేఱిచూడంగ రా' దన్నఁ దెలిసి జలధి
'రథము చనునంత శోషింతుఁ బథముఁ గొనుము.'

వ॥ అనుటయు మురాంతకుండు 'రత్నాకరా! నీవు శోషింప వలవదు. నీయనితరగమ్యధైర్యమును నీ యనర్ఘ్యమణిప్రకరంబును నన్యులు గనుంగొన నేల? నా వారువంబులు చనియెడు నంబుపూరంబు శిలాసదృశంబుగఁ జేయు; మదియ చాలు'ననుటయు, నప్పారావారము తారూపై రథ మరుగునంత త్రోవ విడిచినఁ గ్రీడియుఁ దనకలాపాండిత్యము హారితలంపున కెక్క నరదంబు సాగించె. ఇత్తెఱంగున నుత్తరసాగరంబు నుత్తరించి చిత్తంబలర గంధమాదనంబు సేరె.

గీ॥ వచ్చునెడ జయంతంబన వైజయంత
మనఁగ నీలంబు నా రజతాచలంబ
నఁగ మహామేరు కైలాసనగము లనఁగ
నింద్రకూటంబు నా వచ్చె నేడుగిరులు.

గీ॥ వివిధవర్ణరత్నప్రభావితతి మెఱయఁ
దమ్ముఁ బనిపంపు మనిన మాధవుఁడు భూధ
రములఁ గృపఁజూచి మీయందు రథము నడపఁ
దెలిపియుండన్న నవియు నత్తెఱఁగు సేసె.

క॥ అంతట నేడునగంబులు
నంతర్ధానంబు చేసె; నట చనఁగా న
త్యంతభయంకరకర్దమ
సంతమసంబున రథంబు సాగక నిలిచెన్.

వ॥ మఱియు నప్పెనుచీకటి కొండచందమయినం బాతాళంబుం జొచ్చుచుంటిమో యని విప్రుండును వివ్వచ్చుండును భ్రాంతిం బడుచుం జొచ్చిరి. అంత దైత్యాంతకుండు తనసముదగ్రనిశితసుదర్శనచక్రదీప్తులఁ దదీయసాంద్రతరసంతమసమును సంహరించె. అర్జునుండును నరదంబుసాగనిచ్చుటయుఁ గొంతవడి నాకసంబున వింతయగు వెలుంగుదోఁచె. ఆ వెలుంగునఁ జొచ్చుచుండ నత్యద్భుతాకారుండగు నొక్క దివ్యపురుషుండు రాకాచంద్రదివాకరానలప్రభలఁ దేజరిల్లుచు విప్రార్జునులకుఁ గన్నులపండువు వొనరించె. అప్పుడు జనార్దనుండు వారినిరువుర నచటె యుండ నియోగించి, తా నావిష్ణుతేజంబునం జొచ్చి, కొంతవడికిం జచ్చినసుతులతోఁ దిరిగివచ్చె. ఎవ్వఁ డే యేఁడు పుట్టె నయ్యేఁటి ప్రాయమున నొప్పుచున్నవారి సుతులను నాఁడుగన్న పసికూనను గోవిందుండు బ్రాహ్మణునకు సమర్పించి వారందఱితోఁ గూడ ద్వారవతిం జేరె.

భగవదనుగ్రహపాత్రులకుఁ బడయరాని సంపద లుండవు.



## పద్మపురాణము.

# 6 సుందోపసుందోపాఖ్యానము.

[మడికి సింగన్న:- ఇతఁడు గోదావరీమండలవాస్తవ్యుఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. ఎఱ్ఱాప్రెగడకుఁ గొంచెము పూర్వముండినవాఁడు. ఇంచుమించుగా 1380 సంవత్సరప్రాంతమువాఁడు. ఇతని రచించినగ్రంథము పద్మపురాణము.]

---

వ॥ పూర్వము సుందుఁడు నుపసుందుఁడునను నమందపరాక్రము లగు నిరువురు దైత్యులు దైత్యసేనాసందోహంబులతోడఁ జెలరేఁగి దేవభూదేవవర్గంబుల నెల్ల బాధించుచు లోకములఁ జీకాకుపరచుచుండిరి.

చ॥ మునిజనకోటిఁ బట్టుకొని
మోములు రాయుచు యాగశాలలం
దనలము వెట్టి కాల్చుచు జ
నాశ్రియధర్మము లెల్ల మాన్చి య
య్యనిమిషసిద్ధసాధ్యఫణి
యక్షసురాహితరాజసంతతిన్
గనుఁగొని పాఱఁదోలుచును
గర్వము దిక్కుల విస్ఫుటంబుగన్.

వ॥ జగంబు లెల్లనుం దారయై వర్తించుచుండె, నిట్లతిదారుణం బగు దైత్యుల పరాక్రమంబునకు బెగ్గిలి దేవతలు కమల

గర్భునికడకుం జని సుందోపసుందదానవులు సేయు నుప
ద్రవంబులు విన్నవించి యిట్లనిరి.

క॥ పడఁగల పాటులనెల్లను
బడిపడి పడలేక విసివి 'పద్మాసన! నీ
యడుగులు గొలువఁగ వచ్చితి
మెడసేయక మద్విరోధి నేపడఁపు మిఁకన్.'

వ॥ అని పెక్కుభంగులఁ బ్రార్థింపఁ బద్మగర్భుం డాలించి
యయ్యసురులు నిరతిశయవరగర్వాతిశయంబునఁ బెచ్చు
పెరుగుట యూహించి యింద్రాదులం జూచి 'సుందోప
సుందు లన్యోపహతులు గారు. అన్యోన్యహతులై మృతు
లు గావలయును. దీనికిఁ దగినయుపాయము గావించెద. మీ
రింక మీస్థానంబులకుం జని సుఖంబుండుఁ'డని పలికె. బృం
దారకులు చన్నయంతన విరించి యోజించి మహాసుస్నాన
ఫలంబున దివ్యలోకసుఖంబు లనుభవించుచున్న వృక్ష
కాంగన యను వనగనామణిం దలంచిన నదియుఁ దత్క్ష
ణంబ యసమానలసమాన సౌందర్యలావణ్యాతిశయంబు
లం బ్రకాశించుచుఁ గన్పట్టుటఁ బ్రత్యక్షంబైన నంత వాణీవ
ల్లభుం డాపల్లవాధర నరసి గౌరవించి, "నీవు తిలోత్తమ
యను నామంబూని బృందారకసుందరీసందోహంబునం
దెల్ల నధికంబగు విభవవిలసనంబునం బ్రసిద్ధవై విహరింపు
చుండు" మని పలికి మఱియు నిట్లనియె.

క॥ 'సుందోపసుందదైత్యులు
బృందారకగణమునెల్లఁ బీడించెద రీ
వం దరిగి వారి నిరువుర
మ్రందింపుము నీవిలాసమాధుర్యములన్.'

ఆ॥ వె॥ అనిన నమ్మహాత్ముఁ గని తిలోత్తమ వక్త్రఁ
జిన్నిమోము వింతఁ జెన్నుమీఱ
"నకట! యోఁడుదాన నసురవీరులమీఁద
నన్నుఁ బనుపఁదగునె నలినగర్భ!"

వ॥ అనిన విని నలువ దరహసితవదనుండై యయ్యింతి కిట్లనియె. "ఆదైత్యులు బలపరాక్రమసంపన్నులు గావున నెవ్వరికి నజేయు లగుదురు. అట్లయ్యు నీ వల్లన నచ్చటికిం జనునప్పుడు నీ సౌందర్యవిలాసంబులం జూచి మదనాతురులై తమలోనం గలకలపడి యన్యోన్యప్రహారంబులం బంచత్వంబు నొందెదరు. అంతట నీ కనాయాసంబుగ లోకోపకారంబు సంభవించు. దేవహితంబగు. ఇవ్విధంబు సేయు"మనిన వల్లె యని సరసిజాసను వీడ్కొని తిలోత్తమ నిజాంగరాగపరిమళమిళితమలయానిలుండు ముంగలిగా నవనీతలంబునకు డిగ్గి నర్మదాతటంబున నసురవరులున్న యశోకవనంబు డగ్గఱె.

ఆ॥ వె॥ అయ్యశోకవనమునందెల్ల విహరించి
సుడిసి కమ్మతావి సోడుముట్ట,

తరుణి విరుల నలరు సురపొన్న తరు వెక్కి
పట్టిమ్రాఁకు లిగురు వెట్టఁ బాడె॥

వ॥ అప్పు డద్దివ్యగానం బత్యంతమధురంబుగా వీఁతెంచిన నవ్వనంబున విహరించుచున్న దనుజనాయకపరిచరవర్గులగు నసురు లయ్యేలుంగు విని చనుదెంచి తిలోత్తమం గనుంగొని చిత్తంబుల నుత్తలంబు గదురఁ బఱతెంచి, శాతకుంభస్తంభవిలసితంబగు మణిమండపస్తంభంబునందు సుందరులు పసిండికోరల నాసవం బందీయఁ గ్రోలుచు నానందించు నన్నదమ్ముల సుందోపసుందమనుజాశనులం గని సమీపించి సంభ్రమంబున మ్రొక్కి యెన్నండు నెఱుంగని చోద్యం బొండు గాంచి వచ్చితి మని విన్నవించి మఱియు నిట్లనిరి.

చ॥ ఇది యొక యింతి యెవ్వతియొ
యవ్వనమంతయుఁ బూవనంబునన్
గదురఁగఁ బెక్కురాగములు
గైకొని పాడుచు మ్రానిమీఁదటన్
బెదరిన లేఁటిచందమునఁ
బిమ్మిటిఁ బొందఁగఁ జూచుచున్న దా
సుదతి వరించినన్ సుఖము
సుబ్బునఁ జూఱలుగాదె యేరికిన్॥

వ॥ అప్పలుకులు వినుటయె తడవుగ మదిరాపానమత్తచిత్తు
లగు నమ్మిక్కిడి రక్కసులిరువురుఁ గ్రక్కున లేచి చని
యశోకవనంబు సొచ్చి తిలోత్తమ నీక్షించి యమ్మత్తకా
శిని విలాసవిభ్రమలీలావిభవంబుల కచ్చెరువొంది మచ్చ
రంబునఁ బెచ్చుపెఱిగి సరభసంబున నయ్యిద్దఱు డా
యం జని.

క॥ 'ఈ చేడియ నా సతి' యని
వే చని సుందుండు గవిసె వెస నుపసుందుం
'డీ చెలియ నాకుఁ బ్రియ' యని
వాచఱవఁగ, నిరువురకును వైరంబయ్యెన్.

ఆ॥ వె॥ అన్నదమ్ము లొక్క యతివకై ప్రేమంబుఁ
దగవు సిగ్గు విడిచి జగడమాడి
రట్ల కాదె యొందు నతివలఁ బొడఁ గాంచి
జాలిబొందకున్నె శంభుఁడైన॥

వ॥ అప్పు డమ్మహాసురు లత్యంతరోషభీషణాకారులై యొం
డొరులం గలయం బెరసి శుండాదండమండితమహోద్దండ
వేదండయుగళంబునుం బోలె నుద్దండగదాదండమండిత
దోర్దండులై యంతకప్రేరణంబున నంత కంతకుం గదిసి
చండతరరోషంబులు నిండార దండధరాకారంబుల నొం
డొరుల వ్రేయుచు నొండొరుల మీఱుచు నొండొరులం
డాయుచు భండనపాండిత్యంబున మెఱయుచు.

ఆ॥ ఘోరపోరి యొక్కపూఁపున నిద్దరు
నొక్కసారి గదల నిక్కి వ్రేయఁ
దలలు వగిలి కూలి రిలమీఁద వ్రాలుచు
గులిశనిహతిఁ గూలు కొండలట్లు॥

వ॥ ఇట్లు సుందోపసుందులు పంచత్వంబు నొందినంతఁ దత్సైన్యంబులెల్ల దైన్యంబునం జెదరి యొండేనియుం జనియె. తిలోత్తమయుఁ గృతకృత్యయై కమలాసనాదిసకలబృందారకబృంద స్తోత్రంబుల ధన్యతం బడసె.

---

విష్ణుపురాణము.

## 7 కంసవధ

[వెన్నెలకంటి సూరన:—ఇతఁడు కృష్ణామండలనివాసుఁడు. రాఘూరి సంస్థానాధీశుఁడైన రాఘవరెడ్డి యాస్థానకవి. నియోగిబ్రాహ్మణుఁడు. క్రీ-శ-1600 సం॥ ప్రాంతమువాఁడు. ఇతఁడు విష్ణుపురాణమును రచించెను.]

---

వ॥ ఒకనాఁడు నారదుండు మధురానగరంబునకుం జని కంసుని సందర్శించి యతండు చేయు సత్కారంబులు వడసి, యతనితోడ వైష్ణవాంశంబుల దేవకీదేవియందు రామకృష్ణులు జన్మించి నందగోకులంబునం బెరుగుటయుఁ, గృష్ణుఁడు పూతనచనుబాలతోడంగూడఁ బ్రాణంబులు

గ్రోలుటయు, శకటపరివర్తనంబు సేయుటయు, యమళార్జునంబులఁ గూలఁద్రోయుటయు, యమునాహ్రదంబుననున్న కాళీయాహిని మర్దించుటయును, ధేనుకాసురుం బరిమార్చి తాళవనంబు నిష్కంటకంబు సేయుటయు, భాండీరవనంబుననున్న ప్రలంబుని బలభద్రునిచేతఁ జంపించుటయుఁ, బర్జన్యప్రయుక్తంబైన వర్షంబువలన నందగోకులనివాసుల కుపద్రవంబుగాకుండ, గోవర్ధనశైలంబు ఛత్రంబుగాఁ బట్టుటయు, గోపికాజనసమేతుండై రాసక్రీడల వినోదించుటయు మొదలుగా సమస్తంబును సవిస్తరంబుగాఁ జెప్పిపోయిన, భగినీపుత్రనృశంసుం డగు కంసుండు మహాకోపంబున.

సీ॥ ఆనకదుందుభి నవరాని వినరాని
దుర్వాక్యసూచులఁ దూలఁబుచ్చె
వృష్ణిభోజాంధకవీరవర్గము నెల్ల
భంగుల సకలసంపదలు గొనిరొ
నందగోపునియాలమందల నన్నింటి
బలిమిఁగైకొన వీరభటుల ననిచెఁ
దనమేలు చూడఁజాలని వీరవర్గంబుఁ
క్రొవ్వాడికొట్టులఁ గ్రుచ్చఁ బనిచె

గీ॥ ధర్మమార్గంబు దప్పని తండ్రి నుగ్ర
సేను శృంఖలాబద్ధునిఁ జేసి బంది

గమున నిడి మేటిదైత్యులఁ గాపువెట్టెఁ
గంసుఁ డత్యంతభీకరాకారుఁ డగుచు.

వ॥ అని యిట్లు తనలో విచారించి తత్క్షణంబున.

సీ॥ అక్రూరుఁ బిలిచి యిట్లను 'నన్నుఁ జంపుట
కై విష్ణుదేవుని యంశమునను
వసుదేవదేవకీవరపుత్రులై రామ
నారాయణులు పుట్టి నందగోప
గోకులంబునఁ బెరుగుచునుండి నావారి
నందఱఁ జంపినారనుచు నేఁడు
నారదుం డేతెంచి నాతోడ సకలంబు
నేకాంతమునఁ జెప్పి యిప్పు డేగె

గీ॥ నెంత చేసిరి చూచితే యీవుదక్క
యకట! నాతండ్రి యుగ్రసేనాదులైన
యాదవులు నాకుఁ గీడుసేయంగఁ బూని
యున్నవా రింక నేమని యుగ్గడింతు?.

మ॥ అని యట్లాడెను గాందినీసుత! ధనుర్యాగంబు గావింపఁగా
నిదె యెల్లుండి యుపక్రమించెదను నీవే తన్మిత్రంబుగా
ముద మొప్పన్ రథమెక్కి వే కదలి రామున్ గృష్ణునిన్ నందగో
పదురాత్ముం గొనిరమ్ము వచ్చినను దత్పాపాత్ములం జంపెదన్.

వ॥ మఱియుఁ జాణూరముష్టికులను ముష్టిహతులచేతనైనను రామ
కృష్ణులం జంపించి లోకంబుల ననివార్యమైన ప్రాభ

వము నొందెదను. తొలుదొల్త రామగోవిందులఁ జంపి పిదప దేవకీవసుదేవుల గీటడంచి, తరువాత నందగోపాలాదుల నందఱఁ బెదపెద కొఱ్ఱుల నిడి వారి గోధనంబులు హరియించి, యంత మాతండ్రియగు నుగ్రసేనునితోఁ గూడ నా కతిద్రోహులైన యదువంశజుల నెల్ల రూపుమాపి, కులక్షయంబు గావించి, నిష్కంటకంబైన యీ జగంబుల నెల్ల నేనె యేలెదను. కావున నీవు నాకుఁ బ్రియంబుగా నీప్రయోజనంబు గావించుటకుఁ బయనముం గమ్ము. లె” మ్మనుటయుఁ బరమభాగవతుండైన యక్రూరుఁడు తనకుఁ గృష్ణసందర్శనంబు గలిగెఁ గృతార్థుండనైతి నని సంతసిల్లుచు రథాధిరూఢుండై మధురాపురంబు నిర్గమించె.

మ॥ అరదంబెక్కి ప్రమోదమేర్పడఁగ న
యక్రూరుఁ డేతెంచుచున్
బరమాహ్లాదము భక్తియుక్తియును దా
త్పర్యంబు చిత్తంబులోఁ
బెరయం గృష్ణుని బుండరీకనయనుం
బీతాంబరున్ ధారుణీ
ధరునిం జూడఁగ నేఁడు గల్గెను గృ
తార్థంబయ్యె నాజన్మమున్.

సీ॥ తలఁచినమాత్రఁ బాతకముల నెడఁబాపు
సుజనవత్సలు నేఁడు చూడఁగలిగె
బ్రహ్మాదులకునైనఁ బ్రణతుల కోపని
మురవిరోధికి నేఁడు మ్రొక్కఁ గలిగె
నఖిలవేదాంతవిద్యారహస్యంబుల
ప్రోడతో నేఁడు మాటాడఁ గలిగెఁ
బ్రపంచికముఁ దృణప్రాయంబు గావించు
ప్రభువు మన్నన నేఁడు పడయఁగలిగె
గీ॥ సత్త్వగుణలేశములచేత జగముఁగాచు
పురుషవర్యుండు నను నేఁడు ప్రోవఁ గలిగె
నెంత భాగ్యోత్తరుఁడనొకో యేను గమల
నాభు సేవించి భక్తి యొనర్పఁ గలిగె.

వ॥ అని యివ్విధంబున విష్ణుభక్తియుక్తుండైన డెందంబు పర మానందంబునం బొందఁ నరిగి యరిగి నందగోకులంబునకు వచ్చె; నంత నాఁటిసాయంకాలసమయంబున రామకృష్ణులు వల్లవకుమారసమేతులై పసులకదుపుల నెల్లను గోష్ఠంబునకుఁ దెచ్చి తమతమ వెరవులం గుదురఁద్రోలి దుగ్ధదోహనంబునకు సమకట్టుచున్నయెడ.

సీ॥ అరుణారుణచ్ఛాయ లగు పాదములు నేల
నూఁది చక్కఁగ నిలుచున్నవాని

పరిమళించుచునున్న విరితెల్లతామర
నెలమితో నవతంస మిడినవాని
గోధూళి పొదివిన కుండలంబులతోడ
నిందీనీలచ్ఛాయ నెసఁగువానిఁ
వక్షంబునందు శ్రీవత్సచిహ్నము కేల
బెడఁగుగా వనమాల నిడినవాని
పేరుకొని లేఁగటావులఁ బిలిచి పిలిచి
పిచ్చలించుచుఁ గోవుల విడుచువాని
క్షీరకలశంబు నుఱుదాల్పుఁ జేతఁబట్టి
యమరు గోపాలకృష్ణు నల్లంతఁ గాంచె.

వ॥ కాంచి దంతురీభూతపులకితశరీరుండై రథంబు డిగ్గి వినయసంభ్రమభక్తితాత్పర్యంబులు చిత్తంబునం బెనంగొన వచ్చి దామోదరునకు సాష్టాంగదండప్రణామంబు సేసిన భగవంతుండు వానిం దనశ్రీహస్తంబుల నెత్తి కౌఁగిటం జేర్చె. తదనంతరంబుగా నందినీసుతుండు రౌహిణేయున కభివాదంబు సేసిన నతండును నట్ల గారవించి, కుశలం బడిగి, యర్ఘ్యాపరికారంబుల మన్నించి యాత్మీయమందిరాంగణంబున నొక్కరమ్యప్రదేశంబున నమ్మువ్వురుం గూర్చుండి యిష్టసల్లాపంబులు సేయుచుండి తగుతెఱంగున మజ్జన భోజనంబులు దీర్చి పథశ్రాంతివలననైన బడలిక తమ కరుణామృతసేచనంబుల నపనయించి యతనితోడ మను

రాపురంబునఁ బుట్టిన విశేషంబు లడుగుటయుఁ జక్రిధరు
నకు నక్రూరుం డిట్లనియె.

సీ॥ నీవు సర్వజ్ఞమూర్తివి నీకుఁ దెలివి
పడనియది యేమి యున్నది పద్మనాభ!
యయిన నావిన్నపం బెల్ల నాదరించి
వినుము నీచిత్త మటపొందఁ దిపనులు నహుష.

వ॥ అని పలికి, కంసుండు నారదప్రేరితుండై యాదవసభా
మధ్యంబున దేవకీవసుదేవుల నుదాసీనంబులాడుటయుఁ,
పితృగౌరవంబు విచారింపక యుగ్రసేను నిగళపాశపునిం
జేసి కారాగృహంబున నునుచుటయును, దనతోడ బంధు
ద్రోహంబుసేయ విచారించుటయు, నద్దురాత్ముని మర్మం
త్రంబున నుపాయనంబులు గొని ధనుర్యజ్ఞవ్యాజంబున
నందాదిగోపకులతోడఁ దమ్ముఁ బిలువవచ్చుటయును విన్న
వించిన నాపఞ్చంపవేది యాతని కిట్లనియె.

క॥ నీ విపుడు నాకుఁ జెప్పిన
యీ వచనములెల్ల నేను నెఱుఁగుదు నక్రూ
రా! వినుము కంసు నసువులు
లే వని యుండుదువుగాని లెక్కింపకుమీ.

సీ॥ నీవు మెచ్చంగ నెల్లుండి నేను గంసు
ప్రాణములు గొని యాదవప్రతతు లెల్ల

నుల్లసిల్లంగ భూమికి నుగ్రసేనుఁ
బట్టభద్రునిఁ జేసెదఁ బ్రాభవమున.

వ॥ ఎల్లి ప్రభాతకాలంబున నిందుఁగల నేతులును బాలును గావళ్ళ నమర్చికొని వల్లవులతోడ నెల్లవిధంబుల సంబరంబు మెఱయ నేనును నీవును రాముండును గొల్లలలోని పెద్దలునుగూడి మథురకు వెడలుదము." అని పలికి యా రాత్రి నందునిమందిరంబునన యందఱు వసియించి మఱు నాఁడు ప్రభాతసమయంబునఁ గాలోచితకృత్యంబులు దీర్చి, దధిక్షీరాజ్యాద్యుపాయనంబులతోడం దగువారి ముందర ననిపి, యక్రూరుండు సారథిగా బలభద్రసహితం బుగా రథారోహణంబుఁజేసి వెడలి క్రమంబుగ మధ్యాహ్నంబునకుఁ గాళిందిం దరిసి యచ్చట మాధ్యాహ్నికాదులగు కృత్యంబులు జరిపి యచ్చోటు గదలి చని సాయాహ్నకాలంబునకు మధురాపురంబున కరిగిరి. అప్పుడు సీరిచక్రుల కక్రూరుం డిట్లనియె.

ఆ॥ వె॥ అరదమెక్కి మీర లరుగుదెంచినఁ గంసుఁ
డలిగి నన్ను నేమిద్రైనఁ బలుకు
గానఁ బాదచారులై నడతెండు మీ
యుపదలెల్లఁ గొనుచు నిపుడ పురికి.

వ॥ మరియు మీరు దేవకీవసుదేవులం బొడఁగనుటకై తదీయ నివాసంబునకుం బోయిన మీమీఁది విరోధంబున నావృద్ధ

దంపతుల కగ్గురాత్ముండైన కంసుం డుపద్రవంబు సేయం దలంచుఁగావున నవ్విధంబు పరిహరించునది, యని నిర్దేశించి యామంత్రితుండై కంసుపాలికిం జని తనపోయిన వృత్తాంతంబును రామదామోదరానుగమనంబునుం జెప్పి నిజనివాసంబునకుం జనియె నంత.

ఉ॥ గోపకుమారకుల్ బలిసి
కొల్వఁగఁ గృష్ణుఁడు సీరపాణితో
నాపురి రాజమార్గమున
నంచితమోహనదివ్యమూర్తియై
యేపున మత్తదంతిగతి
నేగుచునుండెను భక్తిసంభ్రమ
స్థాపితచిత్తులై నిలిచి
సర్వజనంబులుఁ జేరి చూడఁగన్.

వ॥ అట్లు చనుదెంచుచున్న సమయంబునన నొక చాకివాఁడు మడుగుపుట్టంబులను గొని కంసుని నగరికిం బోవుచుండ దామోదరుండు వానిం బిలిచి, యందుఁ గొన్ని వస్త్రంబులం దనకుఁ గట్ట నిమ్మనుటయు నీచుండగు నారజకుండు మురవైరిని నిరసించి పలికె. అన్నగధరుండు నాగ్రహించి పటుతరముష్టిఘాతంబున వానిశిరంబు వగులంగొట్టి వాని చాకి మూటం బట్టి విప్పి.

గీ॥ సీరపాణికి వందులో జిలుఁగు వన్నె
పట్టుపచ్చడ మొక్కటి గట్టి నిచ్చి
పసిఁడిచెఱఁగుల పచ్చనిపచ్చడంబు
తాను ధరియించెఁ గృష్ణుఁ డుద్దండమునను.

వ॥ తక్కిన వస్త్రంబులన్నియు వల్లవకుమారుల కొసంగి పుష్పలావికగృహంబునకుం బోయి తమకు ముకుందవందగిన సురభికుసుమనికరంబు లడిగిన వాఁడు భయభక్తితాత్పర్యంబులతోడ మోఁకరించి కరంబులు నేలనూది నమస్కరించి పరిమళమిళితంబులైన పూవుదండ లొసంగిన పుండరీకాక్షుండు వానికిఁ గులాభివృద్ధియు మోక్షంబును గలుగు వరంబు లిచ్చి యందుండి కదలిపోవుచు, మార్గంబున నొక్క యెడ నొక కుబ్జకాంతం గనుంగొని చందనం బడుగుటయు నయ్యిందువదన ముకుందునిసౌందర్యంబుమెచ్చి తనకోర లోని ఘనసారగంధంబు వానికి వలసినంత యొసంగె.

క॥ తనువున నెఱపూఁతలుగా
నొనరఁగ గందంబు పూయుచుండి వినోదం
బున సల్లాపములాడుచు
వనజాక్షుఁడు కుబ్జకాంత వరచుబుకంబున్.

తే॥ తనకరాంగుళములఁ బట్టి దానిపాద
యుగముపై నిజచరణంబు లొక్కరఁ బెట్టి

నిక్కఁ దిగిచి విక్షేపణ మక్కజముగఁ
జేయుటయు మోహనాకృతిఁ జెలఁగెఁ దరుణి.

వ. ఇట్లు కుబ్జ ననుగ్రహించి యబ్జాక్షుండు వెడలి బలభద్ర ప్రముఖులతోడ రాజద్వారంబుఁ బ్రవేశించి ధనుశ్శాల లోని కరిగి యచ్చట గంధపుష్పంబుల నలంకృతంబైన కంసుని ధనుష్షం గనుంగొని యమ్మహోత్సవంబుఁ జూచు వారిచేత ధనుర్మాహాత్మ్యంబు విని దానిమోపెట్టినంత నయ్యాది తునియ లయ్యె. అప్పు డాయుధాగారరక్షకులు కోపారుణితనేత్రులై యప్పద్మనేత్రునిపైఁ బడ నతండు వారల నెల్లర సమయించి లోకభయంకరంబుగ సింహనాదంబొన రించె. అంత హతశేషులు పఱుగునఁ జని కంసున కచ్చటి వృత్తాంతంబంతయు నివేదింప నతండు కోపవివశుండగుచు రామదామోదరులం గూల్పఁ జాణూరముష్టికుల నియోగించుచు వారల కిట్లనియె.

క॥ ఎల్లిప్రభాతంబున మీ
మల్లురతోఁ గూడి రంగమధ్యంబున మీ
రెల్లవిధంబులఁ జంపుడు
గొల్లపడుచులను నియుద్ధకుశలత మెఱయన్.

వ॥ మఱియుఁ గువలయాపీడం బను గంధసింధురంబు మావంతునిచేతం బ్రచోదితంబై రంగద్వారంబున నిలిచి బలభద్ర కృష్ణులు వచ్చినప్పు డదియె వధియింపఁగలయది. సమస్త

సైన్యంబులుఁ గట్టాయితంబై బలిసి నగరివాకిటికి వచ్చునది యని నియమించె. అమ్మఱునాడు ప్రభాతసమయంబున భోజరాజు.

ఉ॥ తమ్ములు బంధుమిత్రులును
దాను నమాత్యచయంబు రాజలో
కమ్మును బౌరులుంగొలువఁ
గంసుఁడు రంగసమీపతుంగమం
చమ్మున నెక్కియుండెను వి
శాలసమున్నతభర్మరమ్య హ
ర్మ్యమ్ములనుండి చూడఁగఁ బు
రాంగనలున్ మఱి రాజపత్నులున్.

వ॥ మఱియు వసుదేవాక్రూరాదియాదవులును నందాది గోపకులును మొదలుగా సమస్తజనంబులును నయ్యె ప్రదేశంబులఁ జూచుచుండిరి. మల్లయుద్ధసన్నద్ధులై చాణూరముష్టికులు రంగమధ్యంబు ప్రవేశించిరి. కువలయాపీడగజంబుతోడ మావంతుండు వచ్చి రంగద్వారంబున నోలసియుండె. అప్పుడు రాజానుమతంబున బలిసి బలభద్రదామోదరులు గోపాలకుమారులతోఁగూడ వచ్చి రంత నామల్లరంగంబునఁ గంసునానతిమై నారాయణునిఁ జాణూరుండును రాముని ముష్టికుండును దలఁపడ

నిశ్చయించిరి. కువలయాపీడంబును బలకృష్ణులపైఁబడ ద్రోలుట.

ఉ॥ పొంగుచు నైపుణంబులును
భూరిబలంబులు నివ్వటిల్ల మా
తంగవిషాణముల్ వెలికి
తత్క్షణమాత్రన దానిఁ జంపి పో
త్తుంగతదీయదంతములు
దోలనమర్చినఁ జూడనొప్పి
చెంగటఁ గాలదండములు
చేకొనియున్న యమద్వయంబనన్.

వ॥ ఇట్లు విజృంభించి రంగమధ్యంబున నిలిచి చాణూరముష్టి కులతోడం దలఁపడి భద్రమూర్తులైన కృష్ణబలభద్రులు పెద్దయుంబ్రొద్దు పోరి పరిమార్చి వారలకళేబరంబుల రంగప్రదేశంబున నీడ్చుచుండఁ గంసుండు కోపరక్తలోచనుండై యమాత్యులం జూచి కోపాలాపంబులు వల్కు చుండ.

మ॥ లలిమీరన్ హరి కంసుమంచమునకున్
లంఘించి యుమ్మెత్తియు
జ్జ్వలమాణిక్యకిరీటమూర్వరపయిం
జారన్ శిరోజాతముల్
బలిమిం బట్టి వెసంబడం దిగిచి లీ
లన్ వక్షమున్ మస్తమున్
నలియం బ్రేగఁ గుప్పిగంతుగొని వి
న్నాణంబు గావించినన్.

వ॥ ఇట్లు విచిత్రంబుగా సకలలోకవిధ్వంసుండైన కంసుండు ప్రాణపరిత్యాగంబు చేసె, నప్పుడు.

క॥ కురిసెం బువ్వులవానలు
మొరసెఁ సురదుందుభులు సముజ్జ్వలమహిమన్
బెరసెం గంధర్వనుతుల్
సరసన్ వినువీధియందు సంభ్రమములతోన్.

ఆ॥ వె॥ అంత రామకృష్ణు లవ్వసుదేవదే
వకులకడకు వచ్చి వారిపాద
పంకజాతములకుఁ బ్రణమిల్లుటయు వేడ్కఁ
గౌఁగిలించి హర్షకలితు లగుచు.

వ॥ రామకృష్ణుల నుతించి గారవించిరి. పిమ్మట దామోదరుండు కారాగృహంబున నిగళబద్ధుండైయున్న యుగ్రసేనుని విడిపించి తదీయరాజ్యంబున కభిషిక్తునింజేసి యతని చేతఁ గంసునికిఁ బరలోకక్రియలు సేయించి యత్యంత కృపాతరంగితలోచనుండై యతని సింహాసనాసీనుం జేసి సమస్తరాజలోకంబును గనిపించి యిట్లనియె.

ఉ॥ ఈ యదువృష్ణిపుంగవులు
నేనును రాముఁడు నెల్లవారలున్
బాయక నిన్నుఁ గొల్చి నిర
పాయత నుండెద మింక నెన్నడున్

మా యెడ శంకయున్ భయము
మాని పనుల్ గొను మీజగంబు ని
త్యాయతబాహుశౌర్యగత
మై విలసిల్లుచు నుండఁ జేసెదన్.

వ॥ మఱియు నారాయణుండు వాయుదేవుం బనిచి మహేం
ద్రుని సుధర్మాసనం బడిగి తెప్పించి యుగ్రసేనున కిచ్చు
టయు.

క॥ అమ్మహనీయసభామ
ధ్యమ్మున యాదవులు గొలువ హరిప్రీతిన లో
క మ్మలర నుగ్రసేనుం
డమ్మధురానగర మేలె నతులవిభూతిన్.



శృంగార నైషధము.

## 8 రాయంచరాయబారము.

[శ్రీనాథుఁడు:- పాకనాటి నియోగిబ్రాహ్మణుఁడు. రెడ్డిరాజులయాస్థానకవీశ్వరుఁడు. 1400 సం॥ ప్రాంతమువాఁడు. ఇతఁడు శృంగారనైషధము, కాశీఖండము మొదలైన పెక్కుగ్రంథములను రచించెను.]



వ॥ నిషధరాజ్యంబున కధిపతియైన నలుం డొక్కనాఁడు పురో
పవనంబున విహారంబు గావించుచుఁ దన్మధ్యస్థంబగు నొక్క
సుందరకాసారంబును సమీపించె. ఆకాసారంబు తిమితిమిం

గిలఢులీకుళీరమత్స్యకచ్ఛపమకరనికరసంచారంబులచేవ్యాకులంబై యుయ్యాలలంబోలె నూగులాడుకెరటాలతోనొప్పియుండె. రాయంచలు బారులు దీర్చి యక్కెరటాల యుయ్యాలలెక్కి పెక్కుభంగుల వినోదంపు టాటలాడు కొనుచుఁ గూయుచుండెను. ఇంతయుఁ జూచి తత్తటాకవైభవంబును నలుం డంతరంగమునం గొనియాడుచుఁ దత్తీర ప్రదేశంబున నిబిడనిద్రాభిముద్రితనేత్రమైన మఱియొక రాజహంసమును గాంచె. అక్కలహంస జంబాలంబులేని పులినభాగంబున నాతపత్రాకృతినున్న యొక్క కమలంబు నీడను దరంగమారుతములచేఁ జిగురుఱెక్కలఱేకు లెగురు చుండ, నొంటికాల నెనిల్చి పొడవగు పొందమ్మిపూవుంబోలె వరుణరాజున కిడిన చామరంబుగతిఁ దోఁచుచుండెను.

క॥ కాంచనపక్షంబగు రా
యంచం గనుఁగొని నృపాలుఁ డనురాగముతో
వంచించి పట్టుకొని మొద
నంచుఁ దలఁచె దైవఘటన కనుకూలముగాఁ॥

సీ॥ వామనుండైన కైటభవైరివిధము
నభినయించుక్రమంబున నధిపసుతుఁడు
నడిఁకి నడిఁకి యల్లల్లన నడిచిపట్టెఁ
బాణిపద్మద్వయంబునఁ బసిఁడియంచ.

వ॥ ఇట్లు నిషధరాజుచేతం బట్టువడి, బిట్టుమేల్కాంచి యు క్కాంచనహంసంబుకంచుగీసిన తెఱంగున నెలుంగించుచు, నెగయ నుంకించుచుం, జంచుపుటంబున వానిపాణిపల్ల వంబులు గఱచుచుం, జరణంబులు గంజుకొనుచు, నఖంబుల నొత్తుచు, నలుదిక్కులుం జూచుచు, నెద్దియుం జేయునది లేక చీకాకుపడుచుండ నప్పాటన సంభ్రమసముత్పత త్పతగకులంబై కమలషండంబు గలగుండువడియె. కూలం బులం గులాయంబులనుండి పుండరీకవనలక్ష్మీచరణ నూపురక్రేంకారంబుల ననుకరించుచుం గారండవబక క్రౌంచరథాంగకోయష్టికాదులు విహాయసంబున కెగసి కూయం దొడంగె; నప్పుడు తనఱెక్కలంగల బంగా రంబునుం గాంచి యంతరంగమున మిక్కిలి యక్కజంపడు నృపపుంగవుంగాంచి యల్లన నారథాంగంబు మనుష్య భాషణంబుల నిట్లనియె.

క॥ ఱెక్కల కొనలం గలిగిన
యిక్కాంచనమానపడియెదే నృప ! నీ కే
యక్కఱ దీనం దీఱెడు
నక్కట ! నీహారలేశ మబ్ధికిం బోలెన్.

చ॥ ఎఱుంగనె నీవు ప్రాంతమున
నింతట నంతట యున్కి యింత యే

మఱుదునె? నిన్ను విశ్వజన
మాన్యుఁడ వంచెద విశ్వసించి యి
త్తఱిసుఖనిద్రఁ బొందితి వృ
థామతి, నెట్టన యాత్మ నమ్మినం
జెఱుపఁ దలంతురే ఘనులు
చిత్తమునం బగవారి నేనియున్ ?

ఉ॥ హింసయ నీకు వేడ్కయగు
నేని గృపాశ్రియమైన యీ సరో
హంసముఁ జంప నేల? కల
వా తరువాత వసుంధరాధిపో
త్తంస! విజృంభమాణభుజ
దర్పనిరంకుశసాహసక్రియా
మాంసలచిత్తవృత్తులయి
మత్తిలియుండు నరాతిభూపతుల్.

వ॥ ఫలకుసుమమూలమాత్రంబున శరీరయాత్ర నడపుచు, మునులుంబోలె సలిలంబులలోనం దపంబు సేయుచున్న వారము. మామీఁద దండనీతిం బ్రయోగింప నీకుం దగునె? అదియునుంగాక.

సీ॥ తల్లి మదేకపుత్రిక, పెద్ద, కన్నులు
గాన విప్పుడు, మూఁడుకాళ్లముసలి
యిల్లాలు గడుసాధ్వి యేమియు నెఱుఁగదు
పరమపాతివ్రత్యభవ్యచరిత

వెనుకముందర లేరు నెనరైన చుట్టాలు
లేవడి యెంతేని జీవనంబు
గానక కన్నసంతానంబు శిశువులు
జీవనస్థితి కేన తావలంబు

గీ॥ కృపదలంపఁగదయ్య యో నృపవరేణ్య!
యభయమీవయ్య యోతుహినాంశువంశ!
కావఁగదవయ్య యర్థార్థికల్పశాఖి!
నిగ్రహింపకుమయ్య యో నిషధరాజ!

వ. "అక్కటకట్టా! దైవంబ! నీకంటికిం బేలగింజయుం బెద్ద యయ్యనే? జననీ! ముదిసిముప్పుఁగాలంబున సుతశోక సాగరం బెబ్భంగి నీఁదఁగలదానవు? ప్రాణేశ్వరీ! యేచందంబున మద్విరహవేదనాదవానలంబునం దరికొనియెదవు? సఖులారా! యేప్రకారంబునఁ బుటపాకప్రతీకాశంబైన కరుణరసంబునఁ బురపురం బొక్కెదరు? బిడ్డలారా! యేలాగున నతిక్షుత్పిపాసాకులంబులై కులాయకూలంబులం గులగులం గూసెద" రని విలాపంబు సేయుచుఁ దృగ్గోళకంబుల వేడికన్నీరు వెడల గోలుగోలున నేడ్చినం గృపాళుండై యాభూపాలుండు హస్తపల్లవంబులు వదలి "రాజహంసంబ! పొమ్ము! సుఖం బుండు"మని విడిచిపుచ్చె. అనంతరంబ.

గీ॥ అట్లు పురుషోత్తముండైన యతని వలన
ముక్తిఁగాంచిన యాద్విజముఖ్యుఁ డెలమి
డెందమునకును వాక్కున కందరాని
యధికతరమైన యానంద మనుభవించె.

క॥ చుట్టంబులుఁ జెలులుం దన
చుట్టుఁ దిరిగియుండ ముదము సొంపెసలారన్
నెట్టిపడి చచ్చి క్రమ్మఱఁ
బుట్టిన చందమున హంసము దటాకములోన్॥



వ॥ నలునిచేదోయి యొత్తునంజేసి నెత్తురులైన యవయవంబులు నోర సవరించుకొనుచుఁ, దనమేని దుర్వికారంబునకుఁ బులుఁగుచుట్టా లెల్ల మిక్కిలి వగచుచుండఁ, దరంగడోలికల నుయ్యాలలూఁగి, తియ్యని తమ్మిపూఁదేనెలం గ్రోలి, కొంతతడవు క్రీడించి, యానీడజంబు క్రమ్మఱ నిషధరాజహస్తంబునకు నరుదెంచె. అంత నాభూభుజుండును భుజంబుసాచి యమ్మానసౌకంబును మన్నించి యిమిడ్చికొనియుండ నయ్యది మృదుభాషణంబుల నిట్లనియె. 'దేవా! అవధరింపుము. నీకుం బట్టువడిన నన్ను విడిచిపెట్టి ప్రాణంబు రక్షించి మహోపకారంబుఁ గావించితివి. ఉపకారికిఁ బ్రియంబు సేయుదు నని యననేర. అయినను నీకు నొక్క ప్రియంబు సేసెద. అయాచితలభ్యంబైన హితంబు పరిహరింపం బనిలేదు. నిఖిలభువననాయకుండవైన నీకు మముఁబోంట్లు సేయు నుపకారం బపేక్షణీయంబు గాదనియు నెఱుంగుదు. అయినను గృతజ్ఞతాగుణలేశంబు నన్నుఁ గ్లేశపఱచుచున్నయది. సన్నంబు దొడ్డ యను విశేషంబు విచారింపక నాచేయు ప్రయోజనం బంగీకరింపుము.

సీ॥ ప్రత్యర్థిసార్థసార్థకనామధేయుండు
భూమీశ్వరుం డొప్పు భీముఁ డనఁగ
నారాజు త్రిదివంబు నమరేంద్రుఁడును బోలెఁ
దేజంబున విదర్భదేశ మేలు

దమనాహ్వయుం డను తపసిసద్వరమునఁ
గాంచె నాతఁడు కన్యకాలలామ
సర్వలోకాంగనాసౌభాగ్యగరిమంబు
దమియించుకతమున దానినామ
మభ్రిభారతి దమయంతి యనుచు నొడివెఁ
దద్గుణంబులు వర్ణింప ధరణినాథ!
యబ్జసూతికి నైన శక్యంబు గాదు
పలుకఁ బూఁబోఁడి కైనను నలవిగాదు.

వ॥ ఏను బ్రితివాసరంబును నానానదీనదకాంతారభూధర ప్రాంతంబుల సంచరించుచు నొక్కనాఁడు విదర్భదేశంబు నకుం బోయి, యందు శరత్సంపూర్ణచంద్రాస్యయైన దమయంతిం గాంచితి. కాంచి, విబుధపురంధ్రిరామ ణీయకం బీరమణీరత్నంబుముందట నిస్సారంబు సౌమ్మ నియు; విధాతచిత్తంబున నీమత్తకాశినికిం దగిన యుత్త ముఁడగు వరుం డెవ్వండు గలిగియున్నవాఁడొకో యనియు; చింతించుచుఁ గొంతతడవు నివ్వెఱపడి చూచుచుండితి. అనంతరంబ యనురూపలావణ్యరేఖాసంపన్నుండైన పిన్న వయసు రాకొమరు నవలోకింతు నని, లోకాలోకపర్యం తంబుగా నీలోకంబు విశ్వంబునుం బరిభ్రమించి, యుర్వీ శ్వరకుమారుల నెల్లం బూర్వపక్షంబు గావించుచు వచ్చి వచ్చి, యిచ్చోట నిన్నుం గనుంగొని సిద్ధాంతీకరించితి. కావున,

గీ॥ సౌరభము లేని యట్టి పుష్పంబువోలె
గండుఁగోయిల వెలియైన కానవోలె
నధిప! దమయంతితోడి సఖ్యంబు లేని
నీదు సౌందర్యవిభవంబు నిష్ఫలంబు.

వ॥ కావున నిఖిలవైమానికనికాయకామ్యమానయైనయమ్మానవతికి నిన్నుం గూర్ప నాకు నేర్పు గలదు. అక్కొమ్మ నెమ్మనంబున నిన్నుం దక్కఁ దక్కొరుం బరిగ్రహింపకుండునట్లుగా భవద్గుణంబు ప్రశంసించెద. నన్నుం బనిగొమ్ము. లెమ్ము. కార్యంబున నార్యులు నిజప్రయోజనంబు నెఱింగింతురు గాని మాటలం బ్రకటింప రని పరిస్ఫుటంబుగాఁ బలికిన విని భూవల్లభుండు తదీయవాక్సుధాధారఁ గ్రోలి మందస్మితసుందరవదనారవిందుం డగుచుఁ గరారవిందంబున నప్పతంగపుంగవునంగంబు నివురుచు దమయంతీగుణబద్ధచేతస్కుండై యానీడోద్భవంబును విదర్భాపురంబునకుం బుచ్చె.

కాశీఖండము.

# 9 గుణనిధి వృత్తాంతము

## 1 వ భాగము.

[గ్రంథకర్త శృంగారనైషధకర్తయగు శ్రీనాథమహాకవి]

---

వ॥ కాంపిల్యపురంబున వేదవేదాంగవేదార్థవిదుండును యజ్ఞవిద్యావిశారదుండును నగు యజ్ఞదత్తుం డను నొక భూసురోత్తముం డుండెను.

గీ॥ అతనిపుత్త్రుండు గుణనిధి యనెడువాఁడు
దర్పకునితోడిజోడు సౌందర్యరేఖ
నెయ్య మలరంగ గురు లుపనీతుఁ జేసి
చదువఁ బెట్టిరి వాని నాచార్యునొద్ద.

వ॥ కాని యతండు లేశమును విద్యాసక్తి లేక దుర్వినీతుఁడై ద్యూతక్రీడారతుఁడై కులాచారంబు లెల్ల విడిచి దుష్టులం గూడి, యుదయసాయంసమయంబులు వీట నెల్లెడఁ దిరుగుచుండెను. గుణనిధి సార్థకనాముండు గాక దుర్గుణనిధియై బ్రాహ్మణాచారములను బరిహాసకము చేయుచు, నగ్నిహోత్రవిధానములన్న నలుగుచు, సంధ్యావందనం బన్న నేవగించుచు, ద్యూతకారులను, బాషండులను నాస్తికు

లను, నటులను, విటులను గూడి సురాపానమత్తుండై గీతవాద్యవినోదంబులఁ బొ్రద్దు పుచ్చుచుండెను. తఱుచు జూదంబుల నోటువడుచు జూదగాండ్రచే బాధింపఁబడుచు దల్లిమేనిరత్నాభరణమ్ములను నమ్మి వారికిఁ బెట్టుచుండును. "తండ్రీ! ఇట్టి దుర్వర్తనంబులును దుస్సహవాసంబులుం బాసి, సద్వర్తనంబును సత్సహవాసంబునుబూనియుండు"మని ప్రతిదినంబును దల్లి వానిచెవినిల్లుగట్టుకొని పోరుచుండును. యజ్ఞదత్తుండు గృహకార్యాంతరవ్యగ్రుండై కొడుకువర్తనంబు పరామర్శింపకయుండెను. ఇట్లు దినంబులు గడచుచుండ.

గీ॥ ఎడపఁ దడపఁ దనూభవుం డెచట నుండుఁ
గానరాఁ డని గృహభర్త కాంత నడుగ
నింత దడవును నాయొద్ద నిచట నుండి
యరిగెఁ జదువంగ నని భర్త కతివపలుకు.

గీ॥ స్నానమాడెనె? వార్చెనె సంధ్య? యగ్ని
హోత్రమాచరించెనె? యింతి! పుత్రుఁ డనిన
స్నానమాడెను, వార్చెను సంధ్య, యగ్ని
హోత్రమాచరించె ననుచు నువిద వెలుఁగు.

ఆ॥ వె॥ కొడుకుపేఁగి కన్నబిడ్డండు గావున
నొక్కరుండు కాన నుత్పలాక్షి
ధూర్తుఁడైన వాని దుశ్చేష్టితములెల్ల
నధిపు నెఱుఁగ నీక యడఁచుచుండు.

వ॥ మఱియుఁ జూడాకర్మానంతరంబున షోడశవర్షంబునఁ దల్లి దండ్రులు విధ్యుక్తప్రకారంబున వానిని వివాహితుం జేసిరి. వివాహితుండైన సుతుండు తన దుశ్శీలంబునుండి మఱలు నని తల్లి భ్రమపడి వానియం దెట్టి మార్పునుం గానక నిరంతరదురాచారసంపన్నుండగుచుండిన సహింపనేరక యొక్కనాఁడు వానింబట్టి కూర్చుండఁబెట్టి గట్టిగ నిట్లు లనియె.

గీ॥ అన్న! మీతండ్రి కోపగాఁడౌనొ కాఁడొ
యీవు నొనరించు దుర్వృత్తి మెఱిఁగెనేనిఁ
గల్లతనములు పలుమాఱు గప్పిపుచ్చు
నట్టి నామీఁదఁ జంపంగ నలుగకున్నె?

సీ॥ సచ్ఛ్రోత్రియులు ననూ[illegible]నులు సోమపీ
థులునైన కులము పెద్దలఁ దలంచి
రాజమాన్యుఁడు సత్క్రతుఁడు వినిర్మలా
చారవంతుండైన జనకుఁ దలఁచి
భాగ్యసంపదయందుఁ బతిదేవతలతోన
నెన్నంగఁ దగియెడు నన్నుఁ దలఁచి
వేదశాస్త్రపురాణవిద్యానిరూఢులై
వాసికెక్కిన తోడివారిఁ దలఁచి

గీ॥ చెడ్డయింటి చెడారమై శివునికరుణ
నివ్వటిలు సర్వదేవేండ్ల నిన్నుఁ దలఁచి

పదియు నాఱ్వత్సరంబులభార్యఁ దలఁచి
గోరతనములు మానురా కొడుకుఁగుఱ్ఱ!

గీ॥ అఖిలకల్యాణగుణగణాయత్త యత్త
మాయ యౌదార్యతేజఃక్షమాహితుండు
ధైర్యనిర్జితమందరాహార్య భార్య
తనయ! యేలయ్య కైకోవు వినయగరిమ.

చ॥ విడువక నీవు పట్టణము
వీథుల వీథుల వెఱ్ఱివాఁడవై
చెడుగులఁ గూడి ధౌర్త్యములు
సేయ మహీరమణుం డెఱింగినన్
విడుచునె సోమయాజి మను
వృత్తులు చేకొను నెల్లవంకలం
జెడుదుముగాదె నీకతనఁ
జీరయుఁ గూడును లేక పుత్రకా!

వ॥ అని యనేకప్రకారంబుల బోధించిన తల్లిమాటలు సెవుల
సోఁకనీక యిట్టట్టనక యూరకుండె. మృగయామద్యపై
శున్యవేశ్యాచౌర్యదురోదరపరదారాభిలాషంబు లను
దోషంబులు నవయౌవనారంభంబుననె సంభవించెనేని
వానిం దొలంగింప నెవ్వారు నేర్తురు? గురువచనం బతి
నిర్మలంబయ్యు సలిలంబునుంబోలె చెవులంబడి దుర్జనునకు
శూలపుట్టించును. అసాధ్యనామకుండయి యుండగు సుగుణనిధి

యథాపూర్వంబుదుర్వర్తనంబులందిరుగుచుండ నొక్కనాఁడు యజ్ఞదత్తుండు కార్యాంతరంబునంబోయి వచ్చుచుండఁ దనరత్నాంగుళీయకం బొక్కజూదరివ్రేలనుండుట గాంచెను.ఆయుంగరంబొకానొకపుణ్యకాలంబున రాజుచేవానికి దానము సంగఁబడెను. ఆసోమయాజియుఁ దనధర్మగేహినియైన సోమిదమ్మ కనురాగాతిశయంబున నొకనాఁడు దానిని గానుకగా నొసంగెను. జూదమాడి యోటువడి, యోటువడిన ధనం బిమ్మని జూదరులచేఁ జుట్టుకొనఁబడిన పట్టికి సోమిదమ్మ యమ్మణియుంగరం బిచ్చి వానిముప్పు దప్పించెను.

సోమయాజి యారతనంపుటుంగరంబును గనుఱెప్పవేయక చూచిచూచి తనసొమ్మౌటయెఱింగి, యాయక్షక్రీడారతుని సమీపించి వాని కేలువట్టియెత్తి యీ యంగుళీయకంబు నీకెట్టువచ్చె? ఉన్నరూపు సెప్పక తప్పఁజెప్పితివేని నిన్ను భూపాలుసన్నిధిం బెట్టి నిజంబు దెలిపి దండింపింతు ననిన జూదరి, 'నీతనయుండు గుణనిధి నెత్తంబున నోడిన విత్తంబునకై యీ యుంగరంబు నాకొసంగె. మఱియుం బెక్కుబంగారుభృంగారంబులు నాభరణంబులుఁ బళ్లెరంబులుఁ దామ్రపాత్రంబు లారకూటఘటంబు లెన్నేనియు దాకట్టు వెట్టియు దురోదరక్రీడాపరాయణుండై పట్టణంబునం జరియించుచున్నవాఁడు.

గీ॥ అక్షధూర్తు లలోన నీయనుఁగుఁగొడుకు
దొరయునంతటి యక్షధూర్తుండు లేఁడు
క్షితితలంబున యాగదీక్షితులలోనఁ
గీర్తి నీయట్టి యాగదీక్షితుఁడు లేఁడు॥

వ. అనిన విని లజ్జాక్రోధంబులు మనంబున ముప్పిరిగొన యజ్ఞదత్తుండు దర్భముండితంబైన మూర్ధంబున నీర్కావిదోవతినటి ముటిఁ జుట్టుకొని యింటికేతెంచి, మొగంబు గంటువెట్టుకొని 'సోమిదమ్మా! యేమిసేయుచున్నదాన విటు రమ్మా. నీకొడుకు చెక్కుటింటిలోనియె? పోవుఁ గాకేమి నారత్నాంగుళీయకంబు దెమ్మా. అయుంగరంబున శృంగారింపని చేతఁ బావకునకు హవిర్భాగంబు సేయంజాల' ననిన సోమయాజికి సోమిదమ్మ యిట్లనియె.

సీ॥ మాధ్యాహ్నసంధ్యాసమాగమం బది తీర్థ
మవధరింపుము సంధ్యయాచరింపు
మగ్నికార్యము దీర్పు మతిథిఁ బూజింపుము
పంచమహాయజ్ఞపరుఁడ వగుము
మొగసాల నున్నారు జగతీసుపర్వులు
గార్హస్థ్యులగుచుఁ బెక్కండ్రతిథులు
పక్వాన్నములు శాకపాకాదికంబులుఁ
జల్లవారిన యేనిఁ జవులుదప్పుఁ

గీ॥ బదిలముగ మందసమునందుఁ బరిణాలో న
నునిచి దాఁచినదాన మీయుంగరంబుఁ
దీవ దిప్పుడు పెట్టె శోధించి చూడ,
నారగించిన పిదప నే నధిప ! తెత్తు.

వ॥ అనిన విని సోమయాజి యత్యాగ్రహంబు వహించి తత్తర పడుచు నీవు పుత్రవతివయ్యు సాధ్వివయ్యు నాయెడ ససత్యంబు లాడవచ్చునే ? నీవు నీకొడుకుంగూర్చి నాతోఁ బెక్కు సూనృతంబులు వలుకుచుంటివి.

సీ॥ స్వాధ్యాయ మెన్నండుఁ జదువంగఁ బోకుండఁ
బోలునె ? చదువంగఁబోయె ననుట
తెల్లవాఱిన నేటఁ దీర్థమాడక యుండ
ననుమాపమే ? తీర్థమాడె ననుట
సమయానుకూలత సంధ్యవార్వక యుండ
నైదగ్గియే ? సంధ్యవార్చె ననుట
తల్లితోడ నగ్నిహోత్రము వేల్వకుండంగ
విజ్ఞానసరణియే ? వేల్చె ననుట
కల్ల లాడంగ ఫల మేమి గలిగె నీకు ?
మాటిమాటికి నేను నీమాట నమ్మి
యరసి రక్షింపనేరక యనుఁగుఁగొడుకు
భ్రష్టుఁ జేసితి నేమి చెప్పంగఁ గలను ?

వ॥ ఆభరణాదికంబు లైన మనయింటి యమూల్యవస్తువ్రాతంబు లెల్ల జూదరులకును వేశ్యలకుం జిక్కె. నిర్భాగ్యురాలా! గృహంబెల్ల నీవును నీకొడుకును పాడుచేసితిరి.

గీ॥ చాలు నింక నాపాలికిఁ జచ్చినాఁడు
కొడుకు గుణనిధి యనువాఁడు కులవిషంబు
తిలలు దర్భయు నుదకంబుఁ దెత్తుగాక
యే నివాపాంజలుల వాని కిత్తు నిపుడు.

వ॥ కుపుత్రత్వంబుకంటె నపుత్రత్వంబు మేలు. కులపాంసనుం డైన వీని నొక్కనిం ద్యజించి కులంబు రక్షించుట నీతి దాయక' మని పలికి, కోపావేశంబునఁ బెదవు లదరఁ గట తటంబులు గదల భ్రూకుటి నిటలంబున నటింపఁ గటా క్షంబులఁ గెంపుగదురఁ గటకటంబడుచు, నాహ్నికంబైన క్రియాకలాపంబు నిర్వర్తించి, యాగ్రహంబు కృతార్థ త్వంబు నొందఁ గొన్నిదివసంబులకు నొక్క శ్రోత్రియుని పుత్రిం బెండ్లియాడి యజ్ఞదత్తుండు గృహస్థధర్మంబు నిర్వర్తించుచుండె.

# 10 గుణనిధి వృత్తాంతము

## 2 వ భాగము.

వ॥ అంతకుమున్న గుణనిధి తండ్రికోపముం బెఱింగి యింటికిం బోవక యెక్కడేనియుం జనువాఁడ నని యూహించి, గతంబంతయు భావించి యిట్లు వితర్కించె.

గీ॥ ఏమిసేయుదు నెక్కడి కేగువాఁడ
ధనము నిష్పచ్చరంబు విద్యయు హుళక్కి;
పెట్టసాగదు నాచేయి భిక్షసేయ
నెట్లునేరుచు దైవంబ యెఱుఁగు నింక.

గీ॥ ఏభయంబును నెచ్చోట నెనయలేదు
నరున కెప్పాట విద్యాధనంబ ధనము
చోరబాధాదికములచేఁ జూఱవోవు
ధనము ధనమౌనె యెన్నిచందములఁ దలఁప.

గీ॥ అక్కటకట! దురోదరవ్యసన మెట్లు?
యాయజూకవిశిష్టాన్వవాయ మెట్లు?
యెట్లుచేసినఁ జేయుఁగా కే మనంగ
నేర్చువారము విధి దయానిస్వహృదయ.

చ॥ అరుణగభస్తిబింబ ముద
యాద్రిపయిం బొడతేర గిన్నెలోఁ

పెరుగును వంటకంబు వడ
పిండెలుతుం గుడువంగఁ బెట్టి ని
ర్భరకరుణాధురీణ యగు
ప్రాణము ప్రాణము తల్లి యున్నదే?
హరహర యెవ్వరింకఁ గడు
పారసి పెట్టెద రీప్సితాన్నముల్.

వ॥ ఇట్లు పెక్కుతెఱంగుల నంతరంగం బున్మూలింప నెందేని యుఱి బోవుచు నిశాసమయం బగుటయు గుణనిధి తన్నుఁ గార్చిచ్చునుంబోలెఁ బేరాఁకలి నేర్చి యందంద కడుపు మండించుచు బాధింప వంటకం బెక్కడఁ గలుగునో యని చింతాక్రాంతుండై యున్న యవసరంబున నద్దినంబు రాత్రి శివరాత్రి యగుటం జేసి, శైవుం డొక్కరుండు నగర బాహ్యప్రదేశంబున నొక్క శివలింగస్థానంబున జాగరంబు సేసి నాలుగుజాలు నుపహారంబు సమర్పించువాఁడై నియమవ్రతంబుఁ బూని భక్తివిశ్వాసతాత్పర్యాతిశయంబున శాకపాకంబులు భక్ష్యభోజ్యలేహ్యపానీయంబులు దధ్యాజ్యపానకఫలరసాదికంబులు సకలమధురపదార్థసమృద్ధి వెలయఁ గొనివచ్చి యుంచిన నప్పుడు భూసురవరుండు నిజనాసికాపుటంబు దదీయపక్వాన్నగంధంబుల గాలివెరవున నాఘ్రాణించి, యాయన్నంబు నాకుఁ గుడువ నెబ్భంగి సమకూఱునో యని యప్పరిమళంబు సవపట్టుకొని పోయి

శంభుభవనద్వారంబునం గూర్చుండి నృత్తగీతవాద్యం
బులు ప్రవర్తిల్లుచుండఁ బ్రొద్దుపోవునందాక జాగరంబు
సేసి యంతంత సాగి ప్రజలు మాటు మడంగి యుండఁ
దా నయ్యవసరంబున.

సీ॥ కట్టాయితంబుగాఁ గటిమండలమ్మునఁ
దీర్చి దట్టీచేలదిండు గట్టి
తలుపు గ్రక్కనఁ గుంచఁ దఱిమి కొంచెంబైన
యోరవాకిట దేహ మొయ్యఁ జొనిపి
మునివ్రేళ్లు లొయ్యొయ్య మోపి చప్పుడుగాని
పరిపాటి పవనంబుబట్టి నడిచి
దీపాంకురచ్ఛాయఁ దెలివిసాలని యట్టి
కొనచీఁకటిని లోని కొనరఁ జొచ్చి
పళ్లెరములందుఁ బూపసూపములతోడ
ననఁటిపండులతోడ నాజ్యంబుతోడ
దధిపయఃక్షౌద్రబహుపదార్థములతోడ
ధవళకలమాన్న మీక్షించె ధరణిసురుఁడు.

వ॥ అప్పుడు గర్భమంటపంబున దీపికాకలిక గాలివశంబున
నిర్వాణదశ వహింప దాని నెగఁద్రోసి బ్రాహ్మణుం డా
యన్నంబు నీక్షింపం దలంచి, గుఱ్ఱిక్కిళ్లు మ్రింగుచు నొక్క
మహాన్నకుంభంబునుం జూచి, మందరశ్మియైయున్న దీపాం
కురంబు నెగఁద్రోసి యందింత నేయివోసి తన యేక

వస్త్రాంచలంబును జించి యొక్కవత్తిం జేసి ఘృతంబున
ముంచి కూర్చి దీపకాంతి నధికంబుఁ గావించి.

సీ॥ పక్వాన్నపాత్రంబుఁ బాణిఁ గైకొని బహి
ర్ద్వారభూమి భుజించువాంఛ నతఁడు
వెల్వడివచ్చుచో విధివశంబున వాని
కాలివ్రేలొకనియంగంబుఁ దాకె
దాఁకిన వాఁడు'త త్తరపాటుతో మేలు
కని మ్రుచ్చు మ్రుచ్చంచుఁ గళవళించెఁ
గళవళింపఁగ దారగతికమార్గంబున
నాక్రోశ మొనరించి రఖిలజనులు

గీ॥ నన్నపాత్రంబు విడువక యవనిసురుఁడు
పాఱె భయవిహ్వలుండయి బయలువట్టి
వెంటఁ దవిలి తలారులు వెగడు పడఁగ
బాణముల నేసి చంపి రా బ్రహ్మకులుని.

గీ॥ అతనిఁ గొనిపోవఁ బనిఁబూని యమునిభటులు
వరుణపాశాగ్రహస్తులై వచ్చి రపుడు
వాని గొనిపోవఁ బనిఁబూని వచ్చి రపుడు
త్ర్యంబకుని కింకరులు విమానంబుఁ గొనుచు.

వ॥ అనంతరము నానావిధప్రహరణపాణులగు పినాకపాణి
భటులం జూచి భీతచిత్తులై కృతాంతకింకరులు కరపంక
జంబులు మొగిడ్చి యిట్లనిరి.

గీ॥ అభవుకింకరులార! మహాత్ములార!
తగవు ధర్మంబు పాడి పంతంబు దెలియు
మీకు నడ్డంబు గలదె ముల్లోకములను
నెంతవారము మేము మీయెదుర నిలువ.

వ॥ వీఁడు కులాచారహీనుండు. పితృవాక్యపరాఙ్ముఖుండు. సత్యశౌచపరిభ్రష్టుండు. సంధ్యాస్నానవివర్జితుండు. శివనిర్మాల్యహర్త. వీనియం దొకధర్మంబు లేశంబు గలిగిన నానతిండు వినియెదము. వీని పుణ్యాపుణ్యవివేకంబునకు మీరె ప్రమాణం బనినఁ గృతాంతకింకరులవాక్యంబు లాకర్ణించి శివకింకరు లిట్లనిరి.

సీ॥ అశన మబ్బకయున్న నైనను శివరాత్రి
యోరంత ప్రొద్దును నుపవసించె
నోగిరంబు హరింప నోనవెట్టుకొనియైన
వేఁగునంతకుఁ జేసె జాగరంబు
పాత్రావలోకనోపాయంబునకు నైన
వెల్లనైన దీపంబు వెలుఁగఁ జేసె
జూడనొల్లక యైనఁ జూచె నీశ్వరుమ్రోలఁ
బరులు చేసినయట్టి ప్రసవపూజ
గీ॥ చచ్చె విధిమూడియైనను చంద్రధరుని
నగరి ముంగిసాలఁ బెంద్రోవ నట్టనడుమ

సూక్ష్మదృష్టి విచారించి చూచినప్పు
డింతకంటె సుధర్మంబు లెవ్విగలవు?

వ॥ కావున సర్వవిధంబుల నీతం డీశ్వరసాన్నిధ్యంబు వడయుట కర్హుం డని పలుకుచు శివకింకరులు వానిని విమానారూఢునిం జేసి కైలాసంబునకుఁ గొనిపోయిరి.

---

భాగవతము.

## 11 అశ్వత్థామావమానము

[బమ్మెరపోతన:- ఇతఁడు శ్రీనాథునకు సమకాలికుఁడు. నియోగి. మహాభక్తుఁడు. భాగవతమును వ్రాసెను. ఈతని నివాసము కడపమండలములోని యొంటిమెట్ట గ్రామము.]

---

వ॥ పాండవకౌరవ యుద్ధంబున మహాయోధులైన వారలు స్వర్గంబునకుం జనిన వెనుక భీముగదాఘాతంబున దుర్యోధనుండు తొడలు విఱిగి కూలి నంత నశ్వత్థామ సుయోధనునకుం బ్రియంబు సేయువాఁడై యర్ధరాత్రంబున రహస్యవృత్తి నేగి నిదురవోవుచున్న ద్రౌపదీపుత్రుల శిరంబులు ఖండించి తెచ్చి రారాజునకు సమర్పించె. మఱునాఁ డుదయంబుననఁ బాంచాలి బాలురచావు కర్ణములం

బడినంతనే బోరన నేడ్చుచు నేలంబడి మూర్ఛిల్ల నర్జునుండు
లేవనెత్తి శిరంబు దువ్వుచు మంజువాక్యంబుల నిట్లనియె.

మ॥ ధరణీశాత్మజ! నీకు నేల వగవన్
ధర్మంబె యా ద్రౌణి ని
ష్కరుణుండై విదళించె బాలకుల; మ
ద్గాండీవనిర్ముక్తభీ
కరబాణంబుల నేఁడు వానిశిరమున్
ఖండించి నేఁ దెత్తుఁ ద
చ్ఛిరముం ద్రొక్కి జలంబులాడు మిచటన్
శీతాంశుబింబాననా!

వ॥ అని యుల్లోడంబఱిచి తనకు మిత్రుండును సారథియు నైన హరి మేలనుచుండఁ గవచంబుఁ దొడిగి గాండీవంబు ధరించి కపిధ్వజుండై గురుసుతునివెంట రథంబుఁదోలించిన గురుసుతుండును ధనుంజయుఁడువచ్చు విజయుం దర్శించి శిశు హంతగావున నిజప్రాణసంరక్షణార్థంబు వడివడిఁ బాఱంజొ డంగె. ఇట్లోపినంతదూరంబు పఱువిడి కొంతవడికి వెనుకఁ జూచి రథతురంగంబు లలయుటఁ దెలిసి నిలిచి ప్రాణ రక్షణంబునకొండుపాయంబులేమి నిశ్చయించి జలంబుల వార్చి ద్రోణనందనుండు సమాహితచిత్తుండై, ప్రయో గంబకాని యుపసంహారంబు నేరకయుఁ బ్రాణసంరక్ష ణార్థంబు పార్థునిమీఁద బ్రహ్మశిరోనామకాస్త్రంబుం

ప్రయోగించిన నది ప్రచండతేజంబున దిగంతరాళంబు నిండి ప్రాణిభయంకరంబై తోఁచిన హరికి నర్జునుం డిట్లనియె. "దేవా! గోవిందా! భక్తాభయప్రదా! వరదా!

క॥ ఇది యొక తేజము భూమియుఁ
జదలును దిక్కులును నిండి సర్వంకషమై
యెదురై వచ్చుచు నున్నది
విదితముగా నెఱుఁగఁ జెప్పవే దేవేశా!"

వ॥ అనినహరి యిట్లనియె. "భీభత్స! దుశ్శీలుండైన యీ ద్రోణజుండు ప్రాణాపాయభయంబున నుపసంహారం బెఱుంగకయ బ్రహ్మాస్త్రంబు నేసె. బ్రహ్మాస్త్రంబునం గాని దీనిని మఱలింపరాదు. నీవును బ్రహ్మాస్త్రంబుం బ్రయోగింపు" మనుటయు నర్జునుండు జలంబుల వార్చి హరికిం బ్రదక్షిణంబువచ్చి ద్రోణనందనుం డేసిన బ్రహ్మాస్త్రంబుమీఁద తన బ్రహ్మాస్త్రముం బ్రయోగించిన,

మ॥ అవనివ్యోమములందు నిండి తమలో
ఢీకొందు బ్రహ్మాస్త్రముల్
రవివహ్నిద్యుతిఁ జూరుచుం ద్రిభువన
త్రాసంబుఁ గావింపఁగా
వివశభ్రాంతి యుగాంతమో యని ప్రజల్
వీక్షింప నాశేష మా

ధవు నార్జున విజయుండు నేసె
　　　　విశిఖద్వంద్వోపసంహారముల్.

వ॥ ఇట్లస్త్రద్వయంబు నుపసంహరించి పురందరనందనుండు ద్రోణనందను పైఁబడి వానింబట్టుకొని యాజ్ఞికుండు యజ్ఞపశువుం గట్టు తెఱంగున బంధించి శిబిరంబునకుం గొని చని వానిని హింసింపనూహించిన హరి వాని కిట్లనియె. "అర్జునా! సంశయింపకుము. అసమర్థులు సుప్తులు నస్త్రవిద్యల నెఱుంగని పిన్నపాపల నిషిద్ధంబని యెంచక వీఁడు వధించె. ఇట్టి దుశ్శీలుండు బ్రాహ్మణుండనియు నిరాయుధుండనియుఁ దలంపరాదు. ఇట్టిపాపమతినిఁ గృపామతిం జేసి కావంజూడకుము. మఱియు.

చ॥ వెఱచినవాని, దైన్యమున
　　　　వేఁదురు నొందినవాని, నిద్రమై
మఱచినవాని, సౌఖ్యముగ
　　　　మద్యముఁ ద్రావినవాని, భగ్నుఁడై
పఱచినవాని, సాధు జడభా
　　　　వమువానినిఁ, గావు మంచు వా
చఱచినవానిఁ, గామినులఁ,
　　　　జంపుట ధర్మముగాదు ఫల్గునా!

శా॥ స్వప్రాణంబుల నెవ్వఁడేనిఁ గరుణా
　　　　సంగంబు సాలించి య

న్యప్రాణంబులచేత రక్షణము సే
యఁగ వాఁ డధోలోక దుః
ఖప్రాప్తుండగు రాజదండమున స
త్కల్యాణుఁడౌ నైన నీ
విప్రుం దండితుఁ జేయు మేటికి మహా
విభ్రాంతిచే నుండఁగన్.

వ॥ ఇట్లు కృష్ణుం డానతిచ్చిన బ్రాహ్మణుండు కృతాపరాధుం డయ్యు వధ్యుండుగాఁడను ధర్మంబుఁదలంచి చంపక ద్రుపద రాజపుత్రికిం దనచేసిన ప్రతిజ్ఞం దలంచి బద్ధుండైన శిశుఘాతిం దోడ్కొని హరిసారథ్యంబున విజయుండు శిబిరంబు సమీపించి, ఫల్గుణుండు మహాపరుషపాశ బద్ధపాణియగు ద్రౌణిని నిరవధికపుత్రశోకయుత యైనద్రుపదసుతకుం జూపిన బాలవధాజనితలజ్జాపరాఙ్ముఖుం డైన కృపికొడుకుం జూచి మ్రొక్కి యాసుస్వభావ యిట్లనియె.

మ॥ పరఁగన్ మామకవారలందఱును మున్
బాణప్రయోగోపసం
హరణాద్యాయుధ విద్యలన్నియును ద్రో
ణాచార్యుచే నభ్యసిం
చిరి, పుత్రాకృతినున్న ద్రోణుఁడవు, నీ
చిత్తంబులో లేశమున్

గరుణాసంగము లేక శిష్యసుతులన్
ఖండింపఁగాఁ బాడియే?

క॥ భూసురుఁడవు బుద్ధిదయా
భాసురుఁడవు శుద్ధవీరభటసందోహా
గ్రేసరుఁడవు శిశుమారణ
మాసురకృత్యంబు ధర్మమగునే తండ్రీ!

శా॥ ఉద్రేకంబున రారు, శస్త్రధరులై
యుద్ధావనిన్ లేరు, కిం
చిద్ద్రోహంబును నీకుఁ జేయరు, బలో
త్సేకంబుతోఁ జీఁకటిన్
భద్రాకారులఁ జిన్నపాపల రణ
ప్రౌఢక్రియాహీనులన్
నిద్రాసక్తులఁ బట్టిచంప నకటా!
నీచేతు లెట్లాడెనో!

ఉ॥ అక్కట! పుత్రశోకజని
తాకుల భారవిషణ్ణచిత్తనై
పొక్కుచునున్నభంగి నినుఁ
బోరఁ గిరీటి నిబద్ధుఁ జేసి నేఁ
డిక్కడ కీడ్చి తెచ్చుటస
హింతని ద్రైభవదీయమాత నేఁ

డెక్కడ నిట్టు శోకమున
నేక్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో.

వ॥ అనికృష్ణార్జునులంజూచి "ద్రోణునితో సహగమనంబు గావింపక ద్రోణకుటుంబిని యింటనున్నయది. మీర లీద్రౌణిం బట్టి నేఁ డిట్లు తెచ్చుట విని దైన్యము నొందుచుఁ బుత్రశోక వివశీకృతనైన నాతెఱంగున నెంత దుఃఖించునో? మఱియు బ్రాహ్మణహింస మనకుం దగదు. వీనిం బరిత్యజింపుఁ" డని ధర్మ్యంబును సకరుణంబును సమంజసంబును శ్లాఘ్యంబునుంగాఁ బలికిన పాంచాలిపలుకులకు ధర్మనందనుండు సంతసిల్లె. నకులసహదేవసాత్యకిధనంజయకృష్ణులునుసమ్మతించిరి. సమ్మతింపక భీముం డిట్లనియె.

చ॥ కొడుకులఁ బట్టి చంపె నని
కోపమునొందదు, బాలఘాతుకున్
విడువు మటంచుఁ జెప్పెడిని,
వెఱ్ఱిది ద్రౌపది; వీఁడు విప్రుఁడే ?
విడువఁగ నేల చంపుఁ, డిటు
వీనిని మీఁరలు చంపరేని నా
పిడికటిపోటునన్ శిరము
భిన్నము సేసెదఁ జూడుఁ డిందఱున్.

వ॥ అని పలికిన నశ్వత్థామకు ద్రౌపది యడ్డంబువచ్చె. భీముని సంరంభంబుసూచి నారాయణుండు చతుర్భుజుండై రెండు

చేతుల భీముని వారించి కడమరెంటను ద్రుపదపుత్రికను దలంగించి నగుచు ననునయాలాపంబుల వృకోదరు నోడం బఱచి కిరీటిం జూచి, "ద్రోవదికి నాకు భీమసేనునకును సమ్మతంబుగ మున్ను నీచేసిన ప్రతిజ్ఞయు సిద్ధించునట్లు నాతంపు సేయు"మని నారాయణుం డానతిచ్చిన నతండును తదనుమతంబున నశ్వత్థామశిరోజంబుల నిశితకరవాలం బునం దఱిగి వానిశిరంబున నత్యంతమహిమాన్వితంబై యొప్పు దివ్యరత్నంబును బరిగ్రహించి పాశబంధముల నూడ్చి పొమ్మని గొబ్బునం ద్రోవ శిబిరద్వారభాగంబునం బడి ప్రాణావశిష్టుండై వెడలిపోయె. అంతఁ బాండవు లును బాంచాలీసహితులై పుత్రులకు శోకించి మృతు లైన బంధువులకెల్ల దహనాదికృత్యంబులుఁ జేసి గంగకుం జని యుదకప్రదానంబు లాచరించియున్నయెడ నుపేం ద్రుండు మునులుం దానును బంధుమరణశోకాతురులైన వారల వగపుమానిచి మన్నించె నిట్లు.

శా॥ పాంచాలీకబరీ వికర్షణమహా
పాపక్షతాయుష్కులన్
జంచద్వర్గుల ధార్తరాష్ట్రుల ననిం
జంపించి గోవిందుఁ డి
ప్పించెన్ రాజ్యము ధర్మపుత్రునకుఁ గ
ల్పించెన్ మహాఖ్యాతిఁ జే

య్యించెఁ మూఁడు తురంగమేధములు దే
వేంద్రప్రభావంబునన్.

---

# 12 హరిశ్చంద్రోపాఖ్యానము

[గౌరనమంత్రి. ఇతఁడు పదునాలవశతాబ్దమధ్యకాలమం దుండినవాఁడు. శైవమతస్థుఁడు. హరిశ్చంద్రోపాఖ్యానమును ద్విపదకావ్యముగా రచించెను.]

---

## —* దేవేంద్రసభ *—

నాకలోకంబునం దొక్కనాఁడు పాకశాసనుండు మేన హరిచందనం బలందికొని రత్నభూషణములం దాల్చి మందార పుష్పంబులు దుఱిమి దివ్యాంబరములు గట్టి దేదీప్యమానంబగు నిజసభాభవనంబునందుఁ జింతామణీభద్రపీఠంబునం దాసీనుండై యగ్నియమప్రముఖులైన దిక్పాలకులును గిన్నరగంధర్వగీర్వాణయక్షప్రముఖులైన సకలనిర్జరవరులును గొలువ, రవలకంకణంబులరవములతో నచ్చరలు వింజామరములిడఁగ, నారదమునివీణానాదమున కనుకూలముగఁ దుంబురుని గానంబును రంభనృత్యంబును మోదావహంబులై యొప్ప నిండుకొలువుండి, కొలువున నుచితాసనాసీనులై యున్న మునిప్రముఖులం జూచి ప్రసంగానుకూలంబుగ వారల నిట్లు ప్రశ్నించెను.

ద్విపద. మూఁడులోకంబుల మునుమిడి మీరు
చూడనియట్టి రాజులు మఱి లేరు,
వారక మును చన్నవారిలో నున్న
వాఁడిలోఁ బుట్టెడివారిలోపలను
బలికి బొంకని మహీపాలుండు గలఁడె
తలపోసి చెప్పుఁ డిందఱు నట్టివాని.

మహేంద్రుం డడిగిన ప్రశ్న వినియు జ్యవనుండు విస్మయం బంది విననియట్లే యూరకుండె. శార్ఙ్గరవుండు నవ్వుకొట్టెను. కశ్యపుఁడుసిగ్గునములుచుండెను. వామదేవుఁడు నేల వ్రాయుచుండెను. మరీచి సోమరియై మీఁదుచూచుచుండెను. గౌతముఁడత్రిమునికిఁ గనుగీట నతఁడు శాతాత్మకునిఁజూచి సన్న చేసెను. అతండును నగస్త్యునిన్నల్లన గోకెను. అగస్త్యుఁడు చేత జమదగ్ని నదిమెను. ఇట్లు మహేంద్రప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరం బెఱుంగక యచ్చటి తాపసోత్తములెల్లరు నొండొరుల నీవు నీ వని చూపి, గుజగుజ లాడుకొనుచుండ మహాజ్ఞానగరిష్ఠుఁడైన వసిష్ఠుఁడు సభవారి గజిబిజిని జేయెత్తి వారించి పురందరునితో నిట్లు పలికె.

వినుము సురేంద్ర! యీవిశ్వంబునందు
వినుతికెక్కిన మహావిక్రమోన్నతుఁడు
తనరు షోడశమహాదానవినోది
వినయభూషణుఁడు వివేకసంపన్నుఁ

డతులసత్కీర్తి మహాభాగ్యశాలి
వితత ధనుర్వేదవిద్యాధికుండు
సర్వశాస్త్రార్థవిచారకోవిదుఁడు
గర్వితరిపుగజకంఠీరవుండు
వరుస నాఱ్ఱువురుచక్రవర్తులలోనఁ
దరమిడి మున్నెన్నఁదగు చక్రవర్తి
నిత్యప్రసన్నుండు నీతిపాలకుఁడు
సత్యసంధుండు త్రిశంకునందనుఁడు
నిరుపమవిజ్ఞాననిధి భానువంశ
శరధిచంద్రుఁడు హరిశ్చంద్రుఁడన్ రాజు;
పోడిమి మదిఁ దలపోసి చూచినను
వాఁడెపో బొంకనివాఁడు దేవేంద్ర!

ఆమాటలు విని విశ్వామిత్రుఁ డత్యంతాగ్రహచిత్తుఁడై యంబుదధ్వనికిఁ గనలి మాఱు గర్జించు సింహము తెఱంగున వసిష్ఠుం జూచి యిట్లనియె. 'వసిష్ఠా! ఇవ్విధంబున మృష లేల వాక్రువ్వవలయు? దధ్యాజ్యశాల్యోదనమాంసభోజనంబులు పరిపూర్తిగా మెసఁగి మత్తులై వర్తిల్లు రాజులు తఱుచు బొంకుచుండుట చూచుచుందుము. కావున జననాథులేయూరు? సత్యమేయూరు? నీపలికిన పలుకు లాదరణీయములుగావు. హరిశ్చంద్రుఁ డెక్కడ? సత్యవ్రత మెక్కడ? నీ వినవంశజులకుఁ బురోహితుండవగుట నయ్యభిమానంబు

పురస్కరించుకొని శతముఖంబుల నీశతమఖునిసన్నిధి నా హరిశ్చంద్రు నింత గొనియాడితివి. ఈ మహేంద్రుఁడు నిన్ను విశ్వసించుఁగాక ! సభవారి కీమాటలు సమ్మతికా' వనుటయు, నరుంధతీవిభుఁడు రోషించి కౌశికుం జూచి.

'అంతగా నాఁబోతు అంకె వేసినను
గంతులు దక్కనే కంఠీరవంబు
కల్ల జంజాటంబు కౌశిక ! యిచటఁ
జెల్లదుసుమ్ము వసిష్ఠుఁ డుండంగ
నురగకంకణుతోడ నూరజోగులను
సరిచేసి యెన్నినచందాన నీవు
నమితసత్యవ్రతుం డగు హరిశ్చంద్రు
సమముగా నృపపిశాచముల లెక్కింతు
వామహారాజేంద్రునటికాలివ్రేలు
భూమిపాలురఫాలముల నైనఁ గలదె?
ఎవ్వనిఁగాఁ జూచి తినకు లేశ్వరునిఁ
గొవ్వి దూషించెదు కొలువుమధ్యమున.

అట్టి సత్యవ్రతు నట్టితేజోధను నారాజచంద్రుఁ బలుమారు నిందించిన నీకు వన్నెవచ్చెనా? వానివాసి చెడియెనా?' యని పలికెను. కౌశికుఁ డంతతో నూరకుండక తనయలుక రెట్టింప 'వసిష్ఠ! యీావట్టి జర్ఝరుల మానుము. వీనికి నేను భయంపడను. తగరుడీకొనినంత కులపర్వతంబు కొందలమొం

దదు. నీ వొకరాజకీటకంబును నొకదుర్మదాంధు నొక కొం డఁజేసి లేనిసత్యంబు కల్పించి కలవియు లేనివియుఁ గొన్నికా ఱులు నాముందటఁ గూయుచున్నావు. ఆహరిశ్చంద్రుని వం దిచందంబునఁ గై వారంబుసేయుచు దంటమాటలు కొన్ని సెప్పి నన్నుఁ గెల్వఁజూచెదవు. సముద్రంబంతయు నక్కజంబుగ నాపోశనము వట్టి యొక్క గ్రుక్కను గొన్నట్టి యీయగస్త్యుఁ డుండఁ, బన్నగాభరణునకుఁ దన యడుగాలఁ గన్నుఁజూపిన యీ గౌతముఁడుండ, నాగ్రహించి నారాయణుం దన్నిన యీభృగుఁడుండ, బ్రహ్మాదిదేవత లెల్లరెఱుంగ సృష్టికిఁ బ్రతి సృష్టిఁగావించిన నేనుండఁ, దక్కిన యీమునిపుంగవు లెల్లరు నుండ, మహేంద్రుని ధర్మసందేహంబుఁ దీర్ప నీవు గడంగుటకు మాలో నెవ్వరికంటెఁ దపోమహిమాధికుఁడవు? నరసురా సురగరుడగంధర్వయక్షప్రముఖులం దెవ్వరును ముజ్జగంబుల బొంకనివారలు లేరు.' నావుడు వసిష్ఠుఁ డిట్లనియె.

'తడవినమాటకుఁ దగిన యుత్తరము
నుడువక ప్రాజ్ఞుండు నోరొత్తుకొనునె
అల రెండువేలజిహ్వలవానికైనఁ
గొలఁదె హరిశ్చంద్రుగుణములు వొగడఁ
దనువెల్ల సత్యంబు తలఁపెల్లఁ గరుణ
పనులెల్ల ధర్మంబు పలుకెల్లఁ బ్రియము
బొంకునాలుకకుఁ జేర్చుటకాని వావి

యింకనిన్నియుఁ జెప్ప నేమి కారణము?
వారిజగర్భునివ్రాత దప్పినను
వారిజాప్తుఁడు దూర్పువంకఁ గ్రుంకినను
మేరువు గ్రుంకిన మిన్ను గ్రాలినను
ధారుణీచక్రంబు తలక్రిందు వడిన
వారిధు లింకిన వజ్రాయుధంబు
ధారదప్పిన మాట తప్పఁ డారాజు.'

అను వసిష్ఠునినిశ్చయం బెఱింగి కౌశికుం 'డయ్యా! తిత్తసంవాదంబు లేల? వానిసత్య మరసినఁగాని నీమాటల విశ్వసింపనేరము. నే నింక నే యుపాయంబునైన వానిని మాయలం గుదియించి మాటల నొంచి యుల్లంబెల్లఁ గలంచి కల్లలాడించిన మనకుఁ బన్నిద మేమైన నున్నదా? నేనింతకుఁ జాలి నిలిచెద. నీవును జగ్గఁగ మున్నె విచారించి యా హరిశ్చంద్రున కేమైనఁ జెప్పఁదగిన దున్నఁ జెప్పి నీపూన్కి తిరంబుఁ గావించుకొనుము.'

వసిష్ఠుండు చిఱునవ్వు నవ్వి "సత్యవ్రతంబు మున్నె వానికి వెన్నతో నిడినది. ఇంకఁ జెప్పఁదగిన దేమున్నది? నీవు వాని తెఱంగెఱుంగక దేవేంద్రునితోడ మించనాడితివి. నీ వొక్కండవె కావు. నీవంటి మునులు వేవురుగూడి వేవేల చందముల మాయలుపన్నినను బాయనియిడుములపాలొనర్చినను మనోవాక్కాయకర్మంబులచే నారాజోత్తముఁడు

కలలంగాని కలవరింతలంగాని నవ్వులంగాని బొంకు వలుకఁడు. కులసతిం బాయుఁగాక! కొడుకు గతించుఁగాక! తనకుఁ బ్రాణాపాయంబు సంభవించుఁగాక! వాని నాలుక నస త్యంబు వెలువడదు. ఆ హరిశ్చంద్రుఁడు-

మఱచి తా నాడినమాట బొంకినను
మఱి నీవు నవ్వ బ్రాహ్మణ్యమునకుఁ దొలఁగి
తపమును వేదశాస్త్రములును మఱచి
యుపవీతసూత్రంబు లొగిఁ బుచ్చివైచి
జపమును సంధ్యాదిసత్క్రియ లుడిగి
వపనమై యధ్యాత్మవాసనమాని
విపుల వల్కలములు విడిచి నెన్నొదుట
నపవిత్రమైనట్టి యంకంబుఁ దాల్చి
ఘనగార్దభము నెక్కి కష్టమానవుని
పునుకలో మద్యంబుపోసి త్రావుచును
జనులెల్ల నేవగింపఁగఁ దలవాంచి
కొని దక్షిణాభిముఖుండనై చనుదు.'

వ॥ ఇట్లు వసిష్ఠుండు గావించిన ఘోరప్రతిజ్ఞ వినినంతనే కౌశికుఁడు విపరీతక్రోధావేశంబున నొడలు మఱచి యుక్తా యుక్తజ్ఞానంబు విడిచి కొలువెల్లఁ గలయం గనుంగొని యెల్ల వారలు విన నిట్లనియె.

"అనిమిషవల్లభుఁడాదిగా సురలు
మునివరు లింక నా పూనికి వినుఁడు!
సాధించి యాహరిశ్చంద్రభూవిభునిఁ
గ్రోధకౌశికిఁ బారి గొఱియగాఁ జేసి
పలుకుపంతము చెల్లుబడిగాఁగ నతనిఁ
జలపట్టి బొంకింపఁజాలక యున్న
సిద్ధచారణమునిసేవితంబైన
సిద్ధాశ్రమంబున శివుని నేఁ గూర్చి
గాలి యాహారంబుగాఁ గ్రోలి యొక్క
కాలూఁది యూర్ధ్వముఖంబుగా నిలిచి
రెండుచేతులు నెత్తి రెప్పలు విచ్చి
చండాంశుపై దృష్టి చక్కఁగా నిలిపి
యెన్నంగఁ బెక్కు వేలేండ్లు తపంబు
మున్ను నేఁజేసిన పుణ్యంబులోన
సగమిచ్చి భువనపరిశ స్తంబుగాఁగ
యుగములు నాలుగు నొగి పదునాల్గు
వరుసలు వర్తింప వసుధ నేలింతు;
మఱి చతుర్దశమహామన్వంతరమున
నిందుని సరిగద్దె నీ స్వర్గమందుఁ
జంద్రకళావతీ సాక్షిగా నునుతు."

ఇట్లు వసిష్ఠవిశ్వామిత్రులు కడుఁ దీవ్రప్రతిజ్ఞలు గావించినంతనే.

పన్నగేంద్రుని వేయుపడగలు గ్రుంకె
మిన్ను బిట్టదరె నిమ్మేదిని దిరిగె
జలధులు గలఁగె నక్షత్రముల్ రాలెఁ
గులగిరులగిలె దిక్కులు వ్రక్కలయ్యెఁ
బెల్లుగాఁ గావిరి బెరసి యద్ధంపు
బిళ్ళపోలికి రవిబింబంబు దోఁచె
గుండె జల్లనఁ జేతికులిశంబువైచి
పండెఁ బొమ్మని దేవపతి కొల్వు విచ్చె
జున్నురేచినరీతి సురలెల్ల బెదరి
కన్నవారేగిరి కన్నత్రోవలకు
నుదరి తాపసులెల్ల నొండొరుఁ గడవఁ
బదపదం డిదె మహాప్రళయంబు వచ్చె
జిటిమి వశిష్ఠకౌశికులకోపాగ్ను
లుఱక లోకంబు లాహుతిఁగొను ననుచు
జడలు వీడఁగఁ గళాసములు విదిల్చి
మడిచి చంకలనిడి మఱలి చూచుచును
జనిరి దిగ్గున నిజాశ్రమముల కట్లు
చనిరి వసిష్ఠ విశ్వామిత్రులంత.



# శ్రీకాళహస్తిమాహాత్మ్యము.

# 13 నత్కీరుని కథ.

## 1వ భాగము.

[ధూర్జటి:- ఇతఁడు పాకనాటి యాజుసేల నియోగిబ్రాహ్మణుఁడు. గొప్పశివభక్తుఁడు. 1520-80 సంవత్సరముల ప్రాంతమువాఁడు. శ్రీకాళహస్తీశ్వరశతకమును, శ్రీకాళహస్తిమాహాత్మ్యమును రచించెను. శ్రీకృష్ణదేవరాయల యాస్థానకవులగు నష్టదిగ్గజములలో నితఁ డొకఁడు.]

---

వ॥ పాండ్యదేశమునకు రాజధానియైన మధురానగరము సకలసంపత్పరిపూర్ణంబై యుమామహేశ్వరుల కిష్టవిహార ప్రదేశమై యలరారుచుండెను. లోకమాతయగు నగజాత పాండ్యభూనేతకు దుహితయై జనించుటచేత నారాజశేఖరుం డల్లుండై యందె విహరించుచుండెను.

గీ॥ ఏపురంబునఁ బెంపొందు నిందుధరుఁడు
పాండ్యభూపాలునల్లుఁడై ప్రజలకెల్ల
నుల్లములలోన నుల్లాస ముల్లసిల్ల
నట్టి మధురకుసరియె యేపట్టణంబు?

వ॥ పాండ్యభూపాలపుత్రియగు భవాని మాణిక్యవల్లియు మరకతవల్లియు నానందవల్లియు నమృతవల్లియుఁ గర్పూరవల్లియు నను నామంబులఁ బిలువంబడుచు నాగరాంగనలచే నిత్యమును బూజింపఁబడుచుండెను. పౌరకాంతలును

బార్వతీదేవినామంబులను దామును ధరించి యొండొరు లం బిలుచుకొనుచు గుంపుగుంపులుగాఁగూడి యత్యుత్సాహమున దేవిసేవకై పోవుచుందురు.

క॥ ఇట్టి మహాత్మ్యంబునఁ గను
పట్టెడు తల్లిఁగల ప్రజలభాగ్యం బిల నే
పట్టుననున్నది పురముల
నెట్టు నుతింపంగవచ్చు నిందున కెనఁగాన్॥

శా॥ ఏమే కల్పకవల్లి! రా వమృతవ
ల్లీ! పోవె కర్పూర వ
ల్లీ! మాణిక్యలతా యిదో మరకతం
బెందుండు? నానందవ
ల్లీ. మీనాక్షులు రండటంచుఁ దమలో
లేమ ల్వివాభోగవ
శామఁ జూక్షులఁ బిల్చు సంభ్రమ మన
ల్పం బెప్పుడుం దత్పురిన్.

వ॥ పార్వతి కూఁతురును బరమేశ్వరుఁ డల్లుఁడునుగాఁ బాండ్యరాజు దానవిద్యాపరకర్ణుఁడై దిగంతవ్యాప్తమహాకీర్తివంతుఁడై వైరిజనభయంకరుఁడై యపారపరాక్రమవంతుఁడై ధర్మపరిపాలనముఁ గావించుచుండెను. ఇట్లుండ నగస్త్యుం డొకప్పుడు ద్రావిడభాషకు వ్యాకరణమును నిఘంటును నలంకారమును నందుఁ గవిత్వము చెప్పుటకు లక్షణమును

గల్పింపనెంచి యొక్క సంఘఫలకంబుపై నష్టాదశాక్షర మాలికను వ్రాసి దానిం గొనిపచ్చి పాండ్యభూవల్లభున కిచ్చి యిట్లనియె. "రాజేంద్రా! ద్రవిడభాషాకవిత్వమహిమచే భారతీదేవికి సమానులైనవా రెందఱికైన నీఫలకంబు చోటిచ్చుచుండును. ఒక్కఁడైన యెడల నాయొక్కఁడు కూర్చుండుటకుఁ దగియుండును. దీనిమహిమం బిట్టిది. మీా పాండ్యరాజులు తరతరంబులుగ నీసంఘఫలకంబును బూజింపుచుండుఁడు."

క॥ అని కుంభజుఁ డిచ్చినవెను
కనేకులు పాండ్యనృపులు గడచినపిదపన్
జనియించెఁ గలియుగంబున
జనవల్లభుఁ డొక్కఁ డతనిసద్వంశమునన్॥

వ॥ ఆ జనవల్లభుఁడు తన పూర్వనృపాలురంబోలె భూభార భరణంబునఁ బ్రజానుమోదంబు వడయుచు నగస్త్యదత్తం బగు సంఘఫలకంబు పై నధివసింపందగిన మహామహుల ద్రవిడభాషావిద్వత్కవుల, మహాకావ్యనిర్మాణనిపుణుల శైవజ్ఞానసంపన్నులఁ బన్నిద్దఱం జేర్చి వారల గౌరవాదరణంబులఁ బోషించుచుండెను.

క॥ ఆసభ మెచ్చఁ గవిత్వం
బేసరసుఁడు చెప్పినన్ మహీశుం డిచ్చున్
జేసేఁతఁ మాడలు వే
యేసి దెసలఁ గీర్తిలతిక లెలమివహింపన్.

చ॥ అడిగిన దిచ్చు నర్థులకు
నాప్తుల కిచ్చు మనంబుఁ గూర్మియున్
బడతుల కిచ్చు సౌఖ్యములు
బంధుజనంబుల కిచ్చు సంపదల్
పుడమి సమస్తజాతులకు
బొంకమి నుత్సవ మిచ్చు శత్రులం
బొడవడగించి సాధుజన పుంగవ
కోటికి నిచ్చు వేడుకల్.

క॥ ఆభూవిభుఁ డిబ్భంగిని
భూభాగం బేలునపుడు పుట్టెన్ గ్రహవ
క్రాభద్రోత్పాతమహా
క్షోభంబు జగంబు వర్షశూన్యము గాఁగన్.

వ॥ మహాకాటకసూచకంబుగ శని మీనంబునకు వచ్చెను. తూర్పున ధూమకేతువు దోఁచెను. దినదినంబును మధ్యందినంబులఁ దుషారము చినుకఁ దొడంగెను. రాత్రులయం దాకసంబు నిర్మలభావంబు నొందుచుండెను. వెలియెండ గాయుచు గాలియు నధికంబయ్యె. మఘాప్రవేశకాలంబు నందును నుఱుముట లేదు. దక్షిణదిక్కున మేఘగర్జలు విన రాఁదొడంగె. ఇంక మహోత్పాతంబు దప్ప దని ప్రజ లెల్లరు భీతిల్లసాగిరి. వాన లేమిని బంట లెల్ల నశించుటం జేసి ప్రజ లెల్లరు గంటెలు చోళ్లు మున్నగు హీనధాన్యంబులకుఁ

ప్రయత్నపడసాగిరి. అన్నము లేక సకలవర్ణములవారు నెడతెగని యుపవాసంబులచేఁ గృశించుచుండిరి.

ఉ॥ తోలును నెమ్ములుఁ మిగిలి
త్రోసినఁ దొంబడి-చోట్లఁ గూలువా
రాలిని బిడ్డలఁ విడిచి
యాఁకటిచిచ్చున వెచ్చపోవు వా
రేలిక బంటువాసి యొక
యించుక లేకకృశించు వారునై
తూలె జనంబు మీనశని
దోషము దాఁకి నిరస్తసస్యమై.

క॥ నవయుచు నుండియు నొకొ్కక
దివసంబున నశనమబ్బఁ దిని దగ మింగులఁ
భువి నొరఁగి లేవనోపక
శివశివ! జనకోటి విడుచు జీవానిలముల్.

క॥ కలవంతంతకు నొత్తఁగఁ
కరవెఱుక తినంగనోపఁ గలుగక మనుజుల్
సురసుర సుక్కి-రి కొందఱు
పరదేశంబులకుఁ జనిరి బ్రదుకులకొఱకుఁ.

వ॥ ఇట్లు మనుష్యుం జంపి మనుష్యుండు తిను దుష్కాలంబగుటయు నాపురంబునం దొకమూల నీశ్వరాలయంబున నివసించుచుండు నొక్క శైవబ్రాహ్మణుండు కూటికిలేక మల

మలమలమాఁడుచుఁ దానును నెందేనియుం బోవ నుద్యమించు చుండ, మహేశ్వరుండు కరుణించి, వానికిఁ బ్రసన్నుండై యన్నగరం బేలుచున్న ఱేనిమీఁద నఱవబాసం బద్యంబు శృంగారరసానుబద్ధంబుగా నొకటి చెప్పి యిచ్చి "యిది చదివిన మెచ్చి వేయిమాడలముడుపిచ్చు. వెచ్చంబున కొదవు. నీవు నెవ్వగ న్నొవ్వక బ్రదుకంగలవాఁడవు. అంతటఁ గఱవును దీరును. జగంబునఁ గృతహర్షంబగు వర్షంబుఁ గురియుంగలదు. సస్యంబులుఁ బండు. పండువు జనంబుల కగు" నని యనుపుటయు నతండును నారాజ సమ్ముఖంబునకుం బోయి శ్రీ పరమేశ్వరప్రణీతంబైన కవితాచమత్కారంబు వచించిన నందలి యర్థంబు "సింధురరాజగమనాధమ్మిల్లబంధంబు సహజగంధం" బనియుం డుటం జేసి,

క॥ దానికి నవ్వుచు నృపసభ
లో నత్కీరుండు వలికె "లోకము నగదే
పూనుకొని సహజగంధము
వేనలికిం గల దటన్న వేయుతెఱఁగులన్.

ఉ॥ తప్పిది చెప్పరాదు కవి
తాసమయంబున కొప్పుగాదు నీ
విప్పగిదిన్ రచింపనగు
నే" యన విప్రుఁడు చిన్నవోయి, "నా

కప్పరమేశ్వరుండు వసు
ధాధిపుపై రచియించి యిచ్చినాఁ
డొప్పను దప్పనే నెఱుఁగ
నుత్తములార!” యటంచుఁ గ్రమ్మఱన్.

ఆ॥ వె॥ వచ్చి పార్వతీశువంకఁ గనుంగొని
యతనిపద్య మతని కప్పగించి
“నిన్ను నమ్మి పోయి నిండినసభ సిగ్గు
చెడితి నున్నకథలు చెప్పనేల ?

క॥ సర్వజ్ఞత్వము బహుముఖ
నిర్వాహకశక్తిగుణము నీకుఁ గలుగఁగా
శర్వ ! నిను నమ్మి పౌరుష
గర్వముఁ బోనాడుకొంటిఁ గడపట సభలోన్.

వ॥ ఈశ్వరా ! ఎవ్వండేనియుఁ దాను బండితుండై తనపాండిత్య
ప్రభావంబున రాజాస్థానంబులఁ గీర్తినొందఁగలండుగాని
విద్యాహీనుండై పరులవిద్య నాధారంబుగాఁగొని రాజస
భలకుఁ బోయినఁ బరాభవం బగు.

క॥ నీమాట నమ్మి పోయిన
నామోసముఁ జెప్పనేల నత్కీరునిచే
నే మాటపడ్డదుఃఖము
నామవ్యథకొలఁదిగాదు సౌజన్యనిధీ!

శా॥ నాభాగ్యం బిటు లుండఁగాఁ దుది నిరు
నత్కారునిం దూఱఁగా
నేభావ్యం బిఁకఁజాలు; నిక్కఱవుచే
నిక్లిష్టి నెంద్రైనఁ గా
నీ ప్రైక్షంబునఁ గుక్షిఁ బ్రోచుకొని దీ
నిం దీర్చి నేవత్తు, దే
వా! భద్రిం బగు నీకు న న్ననుపవే
యన్నం గృపామూర్తివై.

"ఎవ్వఁడో నత్కారుఁ డఁట! నాపద్యంబునఁ దప్పువట్టె నట! అ దెట్టిదో చూచెదఁగాక! యని నిటలాక్షుం డాగ్రహించి యా బ్రాహ్మణునితో రాజభసకు వచ్చి యెల్లవారలు విన నిట్లనియె.

శా॥ ఈరాజన్యునిమీఁద నేఁ గవితసా
హిత్యస్ఫురన్మాధురీ
చారుప్రౌఢిమఁ జెప్పి పంప విని మా
త్సర్యంబు వాటించి, న
త్కారు డూరక తప్పువట్టెనఁట యే
దీలక్షణంబో యలం
కారంబో పదబంధమో రసమొ చ
క్కం జెప్పుఁ డాతప్పునన్.

వ॥ అని యడిగిన నత్కీరుఁడు మునుపటివలెనె కాంతాధమ్మిల్లము సహజగంధమై యుండు నని చెప్పుట తప్పనినిరూపించె. అంతఁ బరమేశ్వరుఁడు పార్వతీదేవి ధమ్మిల్లము సహజగంధంబై యుండు నని పలుక నత్కీరుండు నవ్వుచు.

క॥ అగజకునైనం దగు నిల
మగువలకుం దగదు మాను మత్సర మింకన్
గగనప్రసూనవాదము
జగతిం బ్రత్యక్షమునకు సరి యనఁ దగునే?

వ॥ కావున నీ వింకఁ గపటంపు వాదమును జాలించి నీదోషంబు నంగీకరింపు మనుటయు నిటలాక్షుం డత్యాగ్రహంబును వహించెను. తన్ను నీశ్వరునిగా వత్కీరుం డెఱుంగఁడనియు, నెఱింగినయెడలఁ దనపద్యంబున నిట్టిదోషంబు పట్టియుండఁడనియు భావించి నిజరూపంబును వానికిఁ జూప నిశ్చయించి, నీలగ్రీవుండు తననిటలనేత్రమును బ్రత్యక్షముఁ గావించెను. నత్కీరుఁడు వానిమూఁడవకన్ను విలోకించియుఁ దనవాదంబు విడక భయంపడక,

క॥ తలచుట్టువాఱఁ గన్నులు
గలిగినఁ బద్యంబుదప్పు గాదన వశమే
వల దిచ్చట నీమాయా
విలసనములు పనికిరావు విడువు మటన్నఁ.

వ॥ ఇందుధరుండు వాని నిర్లక్ష్యభావంబున కెంతయు గుపి తుండై "ఓరీ! నత్కీరా! నీవు కుష్ఠవ్యాధిం దపియించు చుండు"మని శపించెను. అంత నత్యంతభయస్వాంతుండై నత్కీరుఁడు గడగడవడంకుచు రుద్రుని పాదపద్మముల వ్రాలి "స్వామీ! మహాపరాధంబు గావించితిని. నీవుదయా ళుండవు. భక్తరక్షామందారుండవు. నాకు శాపాంతం బను గ్రహింపు" మని ప్రార్థింప, "నీవు కైలాసంబును సందర్శింపుము. దానం జేసిన నీకుష్ఠవ్యాధి తొలంగఁ గల"దని నీలకంఠుండు పలికి యదృశ్యుఁడయ్యెను. అంత నత్కీరుం డును దాను గావించిన శివదూషణాం బను మహాదోషం బును దలంచుకొనుచుఁ బశ్చాత్తాపపడుచు డెందంబునఁ గొందల పడసాగెను.

ఉ॥ ఈకవితాభిమానము వ
హించితి నేటికి? సంఘపీఠపై
నీకవు లున్నయట్లు వసి
యింపక దేవునితోఁ నేల చా
ర్వాక మొనర్చితిన్? గడుభ
రంబగు కుష్ఠరుజా విషాద మే
నేకరణిం ధరింతు, నిఁక
నెన్నఁడు చూచెద వెండిగుబ్బలిన్॥

ఉ॥ ఎన్నిమహానదుల్, వనము
లెన్ని, గిరీంద్రము లెన్ని, బోయపీ
ళ్లెన్ని, మృగంబులెన్ని, జన
హీనములైన పథంబులెన్ని, నే
నిన్నియుఁ దాటి యేకరణి
నీశ్వరు శైలముఁ జూడఁ బోయెదన్
గన్నదిగాదు విన్నయది
గాని సదాశివ! యేమిసేయుదున్?

మ॥ హరిశార్దూలమదేభఖడ్గశరభ
వ్యాకీర్ణముల్ రాక్షసో
త్కరసంచారనివాసముల్ హిమపయో
ధారాళవర్షంబులు
ద్ధురసంఘర్షణబాధకోపలము లా
తోగ్రివల్ సనన్ శక్యమే
కరుణాసాగర! భక్తవత్సల! శివా!
గౌరీశ! యెట్లోగదే?

సీ॥ తివిరి యంగమ్మునఁ దిమిరి యొత్తకమున్న
యొడలెల్ల మచ్చలఁ జెఱకమున్న
దళమెక్కి గాత్రంబు చెలువు దప్పకమున్న
బుడుపులు మేన నేర్పడకమున్న

యలత విగ్రహమున నంకురింపకమున్న
కాయంబు వెడరూపుగాకమున్న
తనువునఁ జీముర క్తములుఁ గాఱకమున్న
దేహ మీఁగలు మూఁగి తినకమున్న
భైక్షమడుగంగఁ బోయినపట్ల జనులు
చూడ రోయకమున్న కాలాడినపుడె
నడవఁగావలెఁ గైలాసనగముఁజూడ
హరుని వాక్యంబు శక్యమే? పరిహరింప.

వ॥ ఇట్లు చింతాపరంపరల మునింగి మునింగి కడకు నక్కీరుండు ధైర్యంబువహించి కైలాససందర్శనార్థ ముత్తర దిక్కుగాఁ బ్రయాణమును సాగించెను

---

# 14 నక్కీరుని కథ

## 2 వ భాగము.

నక్కీరుఁడు మధురానగరంబును నిర్గమించి పోవుచు మార్గమధ్యంబునఁగల చెవ్వందీశ్వరక్షేత్రంబునఁ బ్రవేశించి యందలి యీశ్వరలింగమును దర్శించి, యందుండి వెడలి జంబునాథశివలింగంబునకు మ్రొక్కి, యచ్చోటు విడిచి కావేరీతీర్థమున స్నానమాడి, యత్తటినీరత్నంబు నుత్తరించి యుత్తరాభిముఖుండై కొన్ని తీర్థంబులు

దర్శించి, పిమ్మట నరుణాచలంబును జూచి, పదంపడి తిరువత్తూరి మహాదేవు నారాధించి, యటఁ జని యేకరసాలేశ్వరునిఁ బూజించి, మఱియుం గొన్ని పయనంబు లొనర్చి, విక్రమసింహానగరాసన్నయగు పెన్నయుఁ దీర్ఘయాత్రాపరులకు సురతరుపుకొమ్మయగు గుండ్లకమ్మయు సుకృతీభూతపాతకశ్రేణియగు కృష్ణవేణియు, నుత్తుంగతరంగసంగతయగు గౌతమగంగయుఁ గుక్కుటేశ్వరపీఠంబగు పీఠికాపురంబును సింహాచలంబును శ్రీకూర్మంబును గోకర్ణంబును బురుషోత్తమంబును గటకంబును జంబాలేశ్వరంబును నందనేశ్వరంబును గగనేశ్వరంబును గయాస్థానంబును గ్రమక్రమంబుగా సేవించుచు గంగానదిని సమీపించెను.

సత్కీరుండు గంగాస్నానముఁజేసి మోక్షస్వామియైన విశ్వేశ్వరుని దర్శించి విశాలాక్షిం గొలిచి, కాలభైరవునిఁ గీర్తించి దుండివిఘ్నేశ్వరుని మొక్కి శంకరశైల దర్శనోత్సాహంబునఁ గాశీపట్టణంబును విడిచి,

సీ॥ ఒకకొన్ని పయనంబు లొయ్యనొయ్యనఁ బోయి
నడువ నోపిక లేక నడుమ నడుమ
నడుముఁ బట్టుక నిల్వఁబడియుఁ గూర్చుండియుఁ
దొంగి దోఁగియుఁ గొన్ని జంగ లరిగి

పొదలు పెట్టుచుఁ దన కడు గామడైయుండఁ
చీము నెత్తురు మేనఁ జిప్పిలంగ
నీఁగలు మూఁగియు రేఁగియు జుమ్ముజు
మ్మనఁగ నుత్తాలశైలాంతరంబు
నిర్మనుష్యంబు బహుసత్త్వనిష్ఠురంబు
నైన కానన మధ్యంబునందుఁ జిక్కి
దిక్కు గానక దీనతాధీనహృదయుఁ
డగుచు నక్కీరకవిచంద్రుఁ డగ్రభూమి.

వ॥ ఒక్క సరోవరంబుఁ గాంచి దానిపొంతకు నొయ్యనం బోయి, యచ్చటి వటవృక్షచ్ఛాయం బ్రవేశించి తదీయశాఖాశైత్యంబున కత్యంతసంతోషంబునొంది కూర్చుండి, తద్వటంబునుండి రాలిన పండుటాకులు బట్టబయటఁ బడినవి విహంగంబులును జలంబులం బడినవి మీనంబులు నై పోవ నందొక్క పలాశంబు జలాశయంబున సగమును దటప్రదేశంబున సగమును బడి మీనపక్షిత్వంబులు గైకొని లోపలికి వెలుపలికిం దివియు చమత్కారంబు నక్కీరుండు చూచి యద్భుతరసపరవశుఁడైయుండెనంత.

ఉ॥ క్రూరనిరీక్షణ ప్రభల
గ్రుడ్డులుఁ గోఱలు నూర్ధ్వకేశముల్
నీరద నీలగాత్రమును
నిష్ఠురవాక్యము లట్టహాసముల్

ఘేరవకంఠ నిస్స్వనము
భీకర హేంతియు మానవాస్థిహా
రారవముల్ సెలంగ వికటా
కృతితో నొక భూత మాతని॥
క॥ పట్టుకొని తనదు గుహాకుం
బెట్టిదముగఁ దెచ్చి మునుపు పెట్టిన మనుజుల్
దట్టిఁబడిన పులుఁగులగతి
నిట్టట్టు పడంగ నునిచి యెంతయు వేడ్క_న్.
క॥ వారల నందఱ నే కా
హారముగాఁ గొనఁదలంచి యయ్యద్రిబిల
ద్వారమున ఱాయి ద్రోచి మ
హారయమునఁ గొలన నుదక మాడఁగఁ బోయెన్.
వ॥ అంత నప్పెనుభూతముచే నంతకుమున్న నయ్యద్రిగుహాం
తరంబున బంధింపఁబడినవారలెల్లరు సత్కీ_రుం గాంచి
యిట్లనిరి.
"గీ॥ ఏమిసేయవచ్చు నింతయు మామీఁదఁ
గరుణలేక కమలగర్భుఁ డిపుడు
నిన్నుఁదెచ్చిపెట్టె నేఁడింక నందఱుఁ
దిను నితండు వీని తెఱఁగు వినుము.
ఈ రక్క_సుండు మానవుల నిరంతరము నూఱుకొని
తొ్రివుచుండు. నూఱువురైనఁగాని వాని కొక్క_ యాహా

రంబునకుఁ జాలరు. నాఁటినుండి బూ_ర్తియగువఱకు మమ్ము భక్షింపక యీ బిలాభ్యంతరమునఁ గూడఁబెట్టుచున్నాఁడు. నేఁడు నిన్నుం దెచ్చుటంజేసి నూఱువుర మైతిమి. నేఁటితో మన కెల్లరకు నూఱేండ్లును నిండు. ఆ రక్కసునకును గడుపు నిండు." నావుఁడు నక్కీరుండు లేశమ్మును భీతిల్లక తన కిష్టదైవంబగు కుమారస్వామి యీ పెనుభూతంబును సంహరించి తన్నుం దనతోడివారిం గాపాడంగలఁ డని నిశ్చయించి నిశ్చలచిత్తంబున సుబ్రహ్మణ్యస్వామిని ధ్యానింపసాగెను.

ఉ॥ తారకదైత్యభంజనుఁడు
దారుణశక్తిధరుండు పన్నగా
హారహరాయుండు దీనజన
తామరభూజము షణ్ముఖాట్టహా
సారభటీవిపాటిత దిగంత
కటాహుఁడు వీనిఁబట్టి సం
హార మొనర్చి యిందఱఁ గృ
పాంబుధియై బ్రతికించుఁ గావుతన్.

ఉ॥ భూతముఁ జంపుచే యరుదు
బోరనఁ దారకుమన్నిగొన్న వి
ఖ్యాతమహాప్రతాపునకు,
నద్రిగుహాలయ మేమిదొడ్డ ని

ఘ్రాతమువంటి శక్తిఁగొని
క్రౌంచముఁ జించిన రౌద్రమూర్తికిన్
భీతిఁదొరంగఁజేయు టొక
పెద్దయె వారితదేవతార్తికిన్.

వ॥ అని యనేకప్రకారంబుల భక్తియుక్తంబుగా నిష్టదేవతా వరేణ్యుండును భక్తశరణ్యుండునగు సుబ్రహ్మణ్య సన్నుతింప ననుకంపాతరంగితాపాంగుండై యతండు చండతరవేగంబునం బయింబడిభూతంబు భూతలంబుపయింబడ్డం బెడచేత నడిచి బిలద్వారంబునం దోఁచినఠాతిఁ దిగిచివైచి యందఱు వెడలుండని యనుగ్రహించిన డెందంబుల నానందంబునం బొంది యిందుశేఖరునందను సందర్శించి వందనంబులు సందడించుచు వారెందేనియుం జనిరి. నత్కీరుండును బునఃప్రణామం బాచరించి నిలుచుటయుఁ బ్రసన్నతాంకురంబులు ముఖపంకేరుహంబునం బ్రభవింప 'నీ వీయెడకు రాఁగతంబేమి' యని యడుగుటయు' నిట్లని విన్నవించె. 'దేవా! ఓ శరణాగతవత్సల! దీనకల్పక! ఏనొక్కతప్పుసేసిన కారణంబున మహేశ్వరుం డాగ్రహించి కుష్ఠరోగవ్యథం బడుమని శపియించె. అంత నే నామహాదేవుని శాపాంతంబును గరుణింపఁ బ్రార్థింపఁ గైలాసదర్శనంబునఁ దొలంగునని యనుగ్రహించె. ఇమ్మహారోగంబున మునింగి లేశమును జవసత్వములు లేక పడరాని యిడుములఁబడుచు దుర్గమంబగు

కైలాసమార్గంబుఁ బట్టి పోవుచుంటి. స్వామీ! నన్ను శీఘ్రింబుగ గమ్యస్థానంబునఁ జేర్చి యనుగ్రహింపు' మని పాదములపైఁబడియె. అంత నద్దేవుండును

"శా॥ కైలాసం బనెఁగాని యుత్తరదిశా
కైలాస మంచాడఁడా
గాలగ్రీవుఁడు వీఁడు దక్షిణదిశా
కైలాసముఁ జూచినన్
జాలుం గష్టము మాను" నంచు మదిలోఁ
జర్చించి, యాపర్వతం
బాలోకింపఁగ నశ్రమంబగు నుపాయం
బాత్మఁ జింతించుచున్.

వ॥ నత్కారుని గాంచి, "కవీంద్రా! నీ పీకాలనిజలంబులం గ్రుంకుము; తోడనే యాడఁబోవుతీర్థం బెదురైనయట్లు నీకు శివశైల మెదురై సిద్ధింపఁగలఁ" దని యనుగ్రహించె.

శా॥ సేనానీవచనామృతంబు చెవులం
జిందంగ డెందంబులో
నానందం బుదయింప నక్కాలనిలో
నత్యంతనిష్ఠం గృత
స్నానుండై తలయెత్తఁగా నెదుటఁ గా
నన్ వచ్చె నాలో నవా
చీనస్థాణునగంబు హేమముఖరీ
సింధుప్రతీరంబునన్.

శా॥ కుష్ఠవ్యాధియు మానె హేమముఖరీకూలస్థకైలాసమున్
నిష్ఠాధీనమనస్కుఁడై కదిసి తన్నీరంధ్రకల్లోలభూ
యిష్ఠౌఘంబునఁ దీర్థమాడి గిరిజాధీశుఁ శివుఁ దేవతా
శ్రేష్ఠుఁ సంస్తుతి నూఱు పద్యములు చేసెందాఁ బ్రవిద్యోక్తిం దగన్.

క॥ ఆనూఱుపద్యములకుఁ
సేనానీజనకుఁ డార్తచింతామణి వి
ద్యానిధిజ్ఞానప్రసవాం
బానాథుఁడు కాళహస్తిపతిప్రీతుండై.

వ॥ సాక్షాత్కారం బొసంగి నక్కీరా! నీభవము ధన్యం బయ్యె. నీకవిత్వంబువలనం బ్రీతుండనైతి. ఇంక నీభయంబు లెల్ల వర్జించి వరంబు వేఁడు మనుటయు నక్కవిశేఖరుం డిట్లనియె.

క॥ ఈ సంసారము దుఃఖా
వాసానందంబు దీని వర్జింపంగా
నే సుఖము గల్గు దయ న
న్నాసుఖమునఁ గూర్పవే కృతార్థుఁడ నగుదుఁన్.

వ॥ శంకరుండు వాని వేడిన వరం బిచ్చి యదృశ్యుండయ్యె.

---

ఉద్భటారాధ్యచరిత్రము.

# 15 చిత్రరథశాపము.

[రామకృష్ణుఁడు-వీనియింటిపేరు తెనాలివారు. ఇతఁడు ధూర్జటినాటికి బాలుఁడై యుండి వానితదనంతరమున క్రీ-శ 1550 సం॥ ప్రాంతమునఁ బ్రసిద్ధుఁడైన మహాకవి, ఇతఁడు ఉద్భటారాధ్య చరిత్రము, పాండురంగమాహాత్మ్యము మొదలగు పెద్దగ్రంథములను వ్రాసెను.]

వ॥ పురాణదంపతులైన పార్వతీపరమేశ్వరు లొకనాఁడు తారాచలంబుపైఁగల యారామంబున వినోదంబుగ విహరించుచుండిరి. కిన్నరకాంతలు విమానంబుల నిలిచితమ పసిడికిన్నెరలు మీటుచుఁ బాడుచు నాజగత్పితరులఁగీర్తించుచుండిరి. పూవులంజొచ్చి పుప్పొడి రేపుచుఁ గొలఁకులం జొచ్చితరఁగలఁ గదలించుచు మలయానిలము చల్లగ వీచుచుండెను. మఱియు నయ్యది వసంతసమయంబగుటఁ జిగురులకు జిగియును గ్రొన్ననలకుఁ జెన్నును విరులకు మురిపెమ్మును బిందెలకు నందమ్మును గాయలకు సోయగంబును దోరలకు గౌరవంబును బండులకు మెండును గలిగి యాకైలాసోపవనంబెల్ల నూతనవిలాసభాసురంబై యుండెను. ఆవనాభ్యంతరమున గణభర్త భవానింగూడి, కలకంఠకుహూకారాంతరములైన మావిమోకలం జొచ్చియుఁ దఱుచైన నెత్తావుల నివ్వటిల్లు పువ్వుపొదరిండ్లం దూరియు, తుమ్మెదబాలికల మనోహరఝంకృియల నొప్పు నడ

బావితీరంబులం దిరిగియుఁ జంద్రికాధవళంబులైన చంద్రకాంతవేదికలపై విశ్రమించియుఁ బెక్కుచందంబుల వినోదింపసాగెను. ఆవిహారంబున ఫణిహారుండు తామరదుద్దులను బంగారపుదుద్దులవలె హైమవతికర్ణముల ఘటించెను. కమ్మని పొగడపూవులం జీరగాఁ గూర్చి యామెకటియం దమర్చెను. వావిలిపూవుల నామె సీమంతవీధికి ముత్యాలచేర్పుకరణి రచించెను. పొన్నపూవులపుప్పొడిని బూఁదేనెలం బోసి మేదించి గంధమువలె నామెమేన నలందెను. చంపకంబుల పతకంబుగూర్చి యామెకంఠము నలంకరించెను. ఇట్లు సాక్షాత్కరించిన యారామలక్ష్మియుం బోలెఁ బ్రేక్షణీయయగు దాక్షాయణింగూడి క్రీడాపరాయణుండై నారాయణసఖుం డఖండితానందకందళితహృదయారవిందుండై యుండు నవసరంబున.

సీ॥ తేటవెన్నెల మించుఁ దెఱచిరా జనిపించు
నకలంకహారవల్లికలతోడ
శేవఁగాంతుల పెల్లుగా వసంతము జల్లు
కటకాంగదకిరీటకములతోడ
తివుట నెత్తావుల దిక్కగు తావుల
నలమి వాసించు మాల్యములతోడ
ప్రకటితంబుగఁ జూపులకు విస్మయముఁ జూపు
రమణీయచిత్రవస్త్రములతోడ

గీ. ప్రమద సల్లాప కోలాహలములతోడఁ
గాంతు లొలుకంగఁ దొడసిరాఁ జెంతరాలు
పుష్పాదులతోడ గంధర్వముఖ్యు లటకు
నురువిమానంబు లెక్కి వచ్చిరి ప్రియమున.

వ॥ ఇట్లువచ్చిన యాగంధర్వులెల్లరు విరించి మున్నిచ్చిన వర గర్వంబునం జేసి యెచ్చటనైనఁ గొంకులేక విచ్చలవిడి నిచ్చకొలంది సంచరించెడు వారలు గావున నుమాపతి యనుమతిం బాటింపక యె యన్నగాగ్రంబున విమానం బులు డిగ్గిరి.

క॥ ఇది రజతాచల మిందుఁ
మదనారి వసించు విబుధమానితసుని నె
మ్మదిఁ దలఁపక గంధర్వులు
తదద్రిపై విడిసి రధికదర్పం బెసఁగ౯.

వ॥ గంధర్వపుష్పగంధులెల్లరు జగన్మోహంబుగ గాంధర్వంబు గావించుచుఁ దమ భర్తలతోఁ బుష్పాపచయమును బ్రారంభించిరి. అప్పుడు నారాయణసఖుండు దాక్షా యణితో నా సమీపంబుననే యొక్క పువ్వుటింటియం దుండెను. ఆరామవిహారంబువలని యాయాసంబు వాయ బరమేశ్వరి పరమేశ్వరుని యంకపీఠంబున శిరం బానుకొని విశ్రమించుచుండెను. పుష్పాపచయోద్యోగంబున నాగం ధర్వులెల్లరుఁ గ్రమక్రమముగ నాపువుటింటి వాకిటకు

వచ్చి నిలిచిరి. కలకలనవ్వెడు చిలుకలకొలుకులతోఁగూడ గొలకొలమని వచ్చిన ఖచరకోటులం జూచి యీశ్వరానుచరుండైన నందికేశ్వరుం డా కలకల మోర్వఁజాలక యీ గంధర్వు లింతటి గర్వాంధులాయని యఖండితరోష కషాయితాక్షుండై,

ఉ॥ భీకరరేఖతోఁ బసిఁడి

బెత్తము ద్రిప్పుచు ఘర్మబిందు జా

లాకరమౌ మొగంబు తరు

ణారుణతేజము లీనఁ గన్నులు

ల్కాకళలన్ జ్వలింపఁ దమ

కంబునశంకరు పువ్వుటింటి యు

వ్వాకిట నిల్చి యిట్లనియె

వారలతోఁ ద్వరమాణవాణియై.

క॥ చీకులరె మీర లీశుఁడు

లోకేశ్వరుఁ డీవనంబులో నీశ్వరితో

నేకాంతంబున నుండఁగ

నీకాంతలు మీరు వచ్చు టిది తగవగునే?

వ॥ అని పెక్కుభంగుల వారింప నావియచ్చరులు నందినిలేశమ్మును జీరికింగొనక మార్గ్యంబున నుమామహేశ్వరస్థానంబును మఱింత సమీపింపఁజొచ్చిరి. అవ్విధంబెల్ల నాత్మ నెఱింగి త్రిపురమర్దనుండు విపరీతకోపంబున.

గీ॥ పులుగరంబునఁ బూని, 'మీరలు పిశాచ
రూపమునఁనుండు'డని వైవ రూపరేఖ
దప్పి వికటాంగులైరి గంధర్వులెల్ల
నెంతవారికిఁ దప్పునే యీశ్వరాజ్ఞ!

క॥ ఆయందము లాచందము
లాయద్భుతరూపరేఖలామంజుసుధా
పాయోక్తులు మిడిపోయెను
గాయజహారుకినుకకతన గంధర్వులకున్.

గీ॥ చంపనలిగియు నొక్కింత చలము మాని
విషమనయనుండు పులినాకి విడిచినట్లు
చావుతోడుత జోడైన చటులఘోర
కష్టరూపంబు వారికిఁ గలుగఁజేయ.

సీ॥ ఎఱసంజకెంజాయ నెక్కొన క్కెంబాడు
చికిపికిపల్లవెండ్రుకలవారు
గమకంబులగు గ్రచ్చకాయలఁ దలఁపించు
కూర్రంబులగు మిట్టగ్రుడ్లవారు
ముడిబొమ్మలును బెద్దమిడిగ్రుడ్లు వెడఁ గోర
దాడలుగల్గు వక్త్రములవారు
పెనుబీఱనరములు పెనఁగి పైఁబ్రాకుటఁ
గనుపట్టు పొట్టపొంకములవారు

గీ॥ కుఱుచలగు హస్తపాదముల్ గుదియఁబొడిచి
నట్లు బలిసినమెడలతో నరయ నూచ
లైన యూరులతో వికటాంగులైన
వారునైరిట్లు గంధర్వవరులు పెలుచ.

వ॥ మదనవిరోధిశాపంబున నాఖచరేంద్రపంక్తికి నెత్తురులేక బీటలువారిన పెదవులును జెట్టుపట్టలవంటి మేనులును దట్టముగ వ్యాపించిన పిశంగరోమములును విస్ఫులింగము లొలుకు నిశితోగ్రదంష్ట్రలును జనించుటచే వారల పూర్వాకారంబులెల్లఁ జిందరవందరయయ్యె. అట్టి వికారాకారంబులకుఁ దోడుగఁ గలకలభాషణంబులును గహాకహాట్టహాసంబులును గనుపట్టె నెక్కడ రక్తపానంబు? ఎక్కడమాంసభక్షణంబు? ఎక్కడమేదోలేపనంబుఎక్కడకపాలధారణంబనుచుమత్తిల్లి భయంకరధ్వనులు గావించుచుండ నాపిశాచబృందంబులం జూచి డెందమునం గొందలంబంది తదధినాథుండగుచిత్రరథుండు,నీలంపురంగుదులకించుతనతలవెండ్రుకలు పల్లవెండ్రుక లగుటయు, నిండుజవ్వనంబుచే గండుమీఱిన తనమేను వికలభావం బొందుటయు, మాణిక్యకంఠహారంబులెల్ల సన్ననిపేగ్రులమాలలగుటయుఁ, గమ్మతావులం జల్లు గందంపుఁబూత మేదోలేపనంబగుటయు, నడుమునకుం గట్టినబట్ట పచ్చితోలగుటయుఁ గనిపెట్టి యవ్విధంబెల్ల హరునిచే నగుట యెఱింగినవాఁ డగుట నయ్యాభ

వునిపాదంబులకు మ్రొక్కి లేచి భయభక్తుల నిట్లనియె.

ఉ॥ ఓ పరమప్రభావ! పురు
హూతముఖామరవంద్య! మేము నీ
పాపలవంటివారము కృ
పాపరతంత్రత దక్క యక్కటా!
మాపయి నిట్లనుగ్రహము
మానుటయే మఱి యింతమాత్రలోఁ
గోపము మానుమయ్య యిఁక
గోపతికేతన! దైత్యశాతనా!

గీ॥ అకట! నీబంటు బంటులమైన మమ్ము
నొక్కతప్పును సైరింప కుఱక ఘోర
శాపదావానలంబున సగము చావు
చంపితివి చాలు నిఁకఁ బ్రోవు చంద్రజూట!

చ॥ నెఱయఁగ లోకపూజ్యుఁడగు
నీచెలికాఁడు గుబేరుఁ గొల్చి మే
ముఱక వికారభావమున
నొందుట నీకుఁ గొఱంత గాన ని
ల్లెఱుఁగక మందెమేలమున
నే మొనరించిన తప్పు గాచి యిం
దఱఁ గరుణారసాబ్ధిఁ బరి
తాపము మానఁగఁ దేల్చు శంకరా!

గీ॥ మృత్యుదేవత యోర్వదు మిహిరతనయుఁ
డోర్వఁ డిభదైత్యనాయకుఁ డోర్వఁ డెందుఁ
ద్రిపురదానవు లోర్వరు తీవ్రమయిన
నీదుకినుకకు మే మెంత? నీలకంఠ!

క॥ కలుషించి తేల తృణక
ల్పులమగు మామీఁదఁ గరుణవోనాడి కటా!
పలుదెగఁగొని బ్రహ్మాస్త్రం
బిలఁ బిచ్చుకమీఁదఁ బూని యేయఁగఁదగునే?

వ॥ అని యనేకప్రకారంబుల సకరుణంబుగాఁ బ్రార్థించుచుఁ బ్రణతులైన గంధర్వాధ్యక్షునిమీఁదం గృపాకటాక్ష వీక్షణామృతంబు వొలయ దాక్షాయణీవల్లభుం డిట్లని యె.

క॥ ఓహో! వగ యుడుగుఁడు మీ
సాహసమున నింతపుట్టె శాపావధి కే
మూహించి తెరువుఁ జెప్పెద
మీహైన్యముఁ గొంత యోర్వుఁడీ! ధైర్యమునన్.

వ॥ ఖచరులారా! ఆర్యావర్తం బను దేశంబున మహావైభవాస్పదంబై రెండవకాశి యనందగిన వల్లకీనామ మహాపురంబుగలదు. ఆపట్టణ రుదగ్భూమికిఁ జేరువనే యొక్క మహావటంబున్నది. మీరెల్లరు నవ్వటవృక్షంబుపై నూఱు దివ్యవత్సరంబులు నివసింపవలయు. ఇంతలోఁగొన్ని హాయనంబు లరిగిన పిదప ముంజభోజుం డను నొక రాజకుల

రత్న ముదయించి యుద్భటారాధ్యుఁ డగు గురువునకు శిష్యుం డగును. అగ్గురుసత్తముఁడు నాయంశంబునం జనియించువాఁడు. ముంజభోజుం డయ్యాచార్యవర్యు నతిభక్తింగొల్చుచుండును.

ఉ॥ ఆగురుమూర్తి కాలగతి
నందుడుఁ దత్తనుధూమయుక్తిచే
వేగ భవన్మహావికృత
వేషము లన్నియుమాని పూర్వరే
ఖాగరిమంబుఁ దాల్చుటయుఁ
గాదు మదీయగణాధినాథతా
యోగము గల్గి నాకడన
యుండెద రేగుఁడు భూతధాత్రికిన్.

వ॥ అంతవరకు మీ రావటంబునం దుండి శివభక్తులను శివలింగధారులను బంచాక్షరీమంత్రపరులను సత్యరతులను ధర్మమూర్తులను మన్నించుచు వారలవంకఁ బోక తదన్యజనములఁ గారింపుచుండుఁడు. ప్రారబ్ధకర్మం బనుభవించుటచేతనే క్షీణింపఁగలదు గావునఁ గర్మానుభవంబునకు వగవం బనిలేదు. కాలక్షేపముసేయక మదుపదిష్టం బగు మార్గంబున శాపావధిం గాంచి మదీయసాలోక్యంబుననుండెదరు, పొం"డని కుండలిమండలేశ్వరకుండలుండు కొండరాచూలితో నంతర్ధానంబునొందె. పిశాచబృందంబులు

నమ్మహాదేవు నాదరంబునఁ గొంతసంతాపంబు వాసి
తొలంగిపోయె.

వాల్మీకిచరిత్రము.

## 16 వాల్మీకికథ

[రఘునాథరాయలు-ఇతఁడు 17 వ శతాబ్దమధ్యమునఁ దంజావూరు రాజ్యము నేలినరాజు. ఈతఁడు వాల్మీకిచరిత్రమును రచించెను.]

వ॥ ఆర్యావర్తమునంగల పుణ్యనదులం గ్రుంకుచు దైవ క్షేత్రంబుల దర్శించుచుఁ గొందఱు మునిచంద్రములు తీర్థయాత్రాకుతుకంబునఁ దిరిగి తిరిగి కాశికానగరంబుఁ జేరుకొని యందుఁ గొన్నిదినంబులు నివసించి, తన్నగరంబు విడిచిపోవుచు "తమసా" నదిని సమీపించిరి. కట్టడగలె గాఢాంధకారబంధురములైన యా తమసానదీప్రాంత కాంతారము లా తాపసోత్తముల కత్యంతభయావ హంబులై కనుపట్టె. మార్గవశంబున వార లా భీకరాట వులం బ్రవేశించి పోవుచు నొక్కయెడ నొక్కభిల్లపల్లెం గాంచిరి. కుళ్ళిన రక్తమాంసాదికంబులచే దుర్గంధబంధు రంబైన యా శబరవాటికం జొచ్చి యమ్మునిపుంగవులు,

క॥ చుట్టును బసరపుటెమ్ములు
తెట్టలు చూచినను మదికి దిగులయ్యెడు హా
కట్టఁడి దైవం బిచ్చటి

కెట్టు మనలఁ దెచ్చె దాఁటు టెట్లో కో యనుచున్.

క॥ చండాలవాటికయు నిటు
లుండునె యీ రోఁతగన్న నొక్కటఁ బ్రేవుల్
గుండెలు నిలువక వాంతికి
నొండరిగెడు కర్మఫల మహో యిటు లుండెన్.

క॥ నెఱి చెదర కరాతులముం
దఱినైనం బోవవచ్చు దయమాలిన యి
క్కఱకు కిరాతులముందఱ
వెఱవక చనఁబోల దిచట వెఱవెయ్యదియో?

వ॥ అని కరంబులు తమ మొగంబుల కడ్డమిడుకొనుచు ముక్కులుమూసికొనుచు, మనసున రోసి రోసి రేగినదుర్గంధమున కుమిలుచు నాసన్న్యాసులు మధ్యందినంబగుటయు మార్గాయాసంబున మిక్కిలి యలసి జడలును గమండలములును మోవఁజాలక మోయుచు నెత్తి వేసినయడుగెల్లఁ గుళ్ళిన మాంసపంకంబునంద పడుచుండ నాకిరాతవీధులఁ బోవునెడ నాకస్మికముగ నొక్క బోయ దాయవలె వారి కెదురయ్యెను. తన భయంకరగర్జనములచే నడవిపులుఁగులు బెగడువడి తూలంగ, నిప్పులురులు బెడిదంపుఁ జూపులతో వచ్చు నా బోయవాఁడు వారల కుఱు మని పిడుగుం బలె దోఁచెను.

చ॥ కటికటియించు నీలిబలు
కాసెయు నల్లని మేనుఁ జిమ్మఁచీఁ
కటి ఘటియింపఁ జేత వీలు
గైకొని మేఘపుఁబిల్లవోలె న
ట్టిటు శరపంక్తు లడ్డముగ
నేయుచు డాయుచు వచ్చివచ్చి యా
జ్జటికుల సార్వభౌములను
సాగఁగ నీ కరికట్టి నిల్చుచున్.

క॥ నిలు నిలువుఁడు! మీచేతం
గల సొమ్ములనెల్ల నిచ్చి కదలుఁడు! నాతోఁ
జలపట్టిన మిమునందఱఁ
బలుచట్టులమీఁద నుతికి పాఱన్ వైతున్.

వ॥ అమ్మునివరులు వానికి మాఱువలుకక నిశ్చలంబుగ నిలువంబడియుండ బాపనపిసాచులకు భీతి గలిగించెద నని యాకిరాతుఁడు విల్లెక్కుపెట్టి వారిపై వాడికోలల నేసెను. కాని యవి గుఱితప్పి నేలఁబడుటయు నొడుగఱచి వాఁడు మఱల నేయ నయ్యవి పఱిక్కకుఁ దొలఁగిపోయె. ఆశబరుం డంత నహంకరించి వెండియుఁ గొన్ని బాణంబు లేయ నయ్యవి పైకిం దేలిపోయె. ఇట్లు పెక్కుసాఱు లేసినయమ్ములెల్ల వమ్మగుటయు నయ్యాటవికుం 'డౌరౌరా! ఎంత వింత ? ఈజడదారుల కంపతప్పుగలదు కాఁబోలు! నాయేటులన్ని

యుం దప్పె నని విస్మయింపడుచు వారిపైబడిఁ జడచుట్టలను బీకివైచియు మెడలపై గుప్పుగుప్పునమోదియుఁ, గమం డలంబులం బగులగొట్టియు, గూనులువడ వీపులపై గుద్దు లుగుద్దియుఁ బలువిధంబుల బాధించి కడకొక్క కానే నియు వారియొద్దఁ గానఁ డయ్యె.

గీ॥ ఇట్లు బాధించి శోధించి యెందు నొక్క
పచ్చపైకంబుగాన కప్పుచ్చిపోయ
నేఁటితెర వాటు పస లేక దాటిపోయె
ననుచు వెస వారిదేసమాని యవలికేఁగె.

గీ॥ వింటి కొప్పునఁ జేయూది విన్నఁబోయి
యసురుసురటంచుఁ గలఁగుచు నున్నవాని
చంద మీక్షించి యప్పు డా శాంతమతులు
మునులు వలికిరి చేసాచి మనికితమున॥

గీ॥ తాపసుల మమ్ముఁ బసులచందమున గొట్టఁ
జేతు లెట్లాడె నిది యేమి చేటు నీకు?
పాతకుఁడుగాఁగ నెన్నాళ్లు బ్రతికెదీవు?
ఊతఁ జేసిరె యోరికి రాత! నిన్ను.

క॥ ఇట మునుపు నీవుచేసిన
పటుసాహసములకు నెల్లఫలమగు నోయీ!
జటివరుల నిటులఁ గొట్టితి
కటకట! యిఁకనైన దురితగతి మానవుగా.

వ॥ ఓరీపుళిందా! నీశరీరము బుద్బుదమువంటిదిగాని శాశ్వతము గాదు. నీ వీరహాస్యమును దలంపక యింతటి ఘోరపాతకము లెట్లు చేయుచుంటివి? నావుడు నాలుబ్ధకుం డతిశుద్ధస్వభావులసంభాషణావిశేషంబున నుల్లంబునఁ గొంత శాంతి పల్లవింప వారలఁ గాంచి, "వేలతపసులారా! ఈ విల్లునమ్ములు నా యాలిబిడ్డలకుఁగాఁ దాల్చితిని. నా చేసినపాతకంబు లెల్ల వారలకుఁగాక నా కంట"వని పలికె. అంత నత్తాపసులు వీని నెట్టులైన ననుగ్రహింపవలయు నని మఱియు ని ట్లనిరి.

క॥ ఓరోరి! నీవు చేసిన
గోరపుబాపముల నీవుఁ గొడుకులు నాలుక్
జేరఁబడి పంచికొందురొ
వారికిఁ బనిలేక నీక వచ్చునొ చెపుమా.

వ॥ ఆప్రశ్నకు శబరుండు ప్రత్యుత్తరం బీయఁజాలక వెలవెలం బోయి, యత్తాపసులమహిమచే నించుకజ్ఞానంబు వడసి, "మునులారా! మీప్రశ్న కుత్తరంబు నాయాలుబిడ్డల నడిగివచ్చెద. అదియే పల్లె. దవ్వు లేదు. నే వచ్చుదనుక మీారిందుఁ గదలవలదు. కదలితిరేని నాలావు నెఱుంగుదురు కదా"యని పలుకుచు నింటికిం జనియె. చనునప్పు డక్కిరాతుఁడు పూర్వమువలె మార్గమధ్యంబునంగల యేణముల నేయఁబోక, పక్షులఁగొట్టక వ్యాకులపాటుతోఁ దనతా

టాకు టిల్లుప్రవేశించి యొక్క జింకతోలుపైఁ జదికిలఁబడి విలునమ్ములు నొకమూలఁబాఱవైచి, వెచ్చగానూర్చుచు దనభార్యను రమ్మని పిలిచెను. తోడనే యేనుఁగుదంతము రోకలిగాఁ జందనపురోలున వెదురుబియ్యము దంపుచుం డిన శబరి శబరనాథునికడకు వచ్చెను. ఇట్లు చనుదెంచిన యయ్యంగనం గనుంగొని యాపుళిందుఁడు.

క॥ "ఓపడఁతి! నే నొనర్చిన
పాపంబులు దలఁప నీకుఁ బనిగలదో నా
కేపనియొ కాక చెఱిసగ
మై పఱగునొ నాకు దాచ కంతయుఁ జెపుమా."

క॥ అన విని యచ్చెలి నగుచుః
విను నాయక! తలఁప నాకు నీదగు పాపం
బునకుఁ బనిలేదు నీపోఁ
పున నెంతయుఁ గుడిచి కట్టి పొసఁగుటకన్నః.

చ॥ తవులగువారి కెవ్వరిక
తంబున నీవెర వప్పుదీసి తె
త్తువొ, కొనితెత్తువో, తెరువు
దోఁచుచుఁ దెత్తువొ, జూదమాడి తె
త్తువొ, చనితెత్తువో, యదియు
దోసమొ పుణ్యమొ నాకు నేటి కా

రవరవ? నీవు తెచ్చినవి డాచక
వండఁగఁ బాడి నిచ్చెలుర్.

వ॥ అమ్మాటలకు వానిడెందంబు చివుకురు మనఁ బుళిందుండు పదంపడి తననందనులంగూడ రావించి వారల నట్లే యడుగుటయుఁ దల్లిచెప్పిన చొప్పుననే కొడుకులుం జెప్పిరి. అంత నా నిషాదుం డత్యంతవిషాదం బంది.

గీ॥ మోసపోయితి నిన్నాళ్లు నాసఁ దగిలి
యాలుబిడ్డలుఁ దానుఁ జుట్టా లనంగ
నెవ్వ రెవ్వార లేయూరి కేదితోవ
వీరి కేఁ బాటుపడు టెల్ల వృథయ యనుచు.

క॥ దోసమునకుఁ బని లే దఁట
నాసొమ్ములు వీరికిం దినం బని గలదే?
రోసితి సంసారముఁ దెగఁ
గోసితి మొదలంట బందుగుల తగులెల్లర్.

వ॥ అని తలంచి సన్న్యస్త సమస్తసంసారుం డగుచు, సుకృత వాసనావిశేషంబున నూతనజ్ఞానంబు వహించి మోదంబు నొందుచుఁ బుత్త్రమిత్త్రకళత్రాదిసంగమంబు తొలంగి, క్రిమ్మఱ నమ్మునులపాలికిం జని యందంద వందనంబులు గావించి, యంజలిపుటఘటితనిటలుం డగుచుఁ దచ్చరణంబుల వ్రాలి, తత్పాదరేణుస్పర్శనంబునఁ గలిగిన వాక్పాటవంబున నోమునీంద్రులారా! మీదర్శనంబునఁ

గృతార్థుండ నైతి. నాజననంబు సఫలంబయ్యె. సకలపాప హారణంబగు నొక్కమంత్రంబు నా కుపదేశింపుండనుచు సంతసంబునఁ బునఃపునఃప్రణామంబు లాచరించిన నవ్వా చంయములు వనేచరుని సమీచీన ధీచాతుర్యంబున కాశ్చర్యంబు నొందుచు, మున్ను వీఁ డెన్నితపంబులు సలి పెనో యాటవికుండయ్యు సత్కర్మంబు నాటింపం దలంచె. నెంతటి ధన్యుం డని సంతసించి, సర్వవర్ణసాధారణంబును నిఖిలమంత్రఫలదంబును, లోకాపారదోషరహితంబును సత్యకామంబును శ్రుత్యభిరామంబును నగు “రామ” నామంబకాని వీనిం బవిత్రుం జేయ వేఱొకయుపాయంబు లేదనియు, నేతాదృశులకుఁ బ్రతిలోమంబుగా నుపదే శింపవలయుననియు విచారించి యాదండ నొక్కతీర్థ కుండంబున నక్కిరాతు సుస్నాతుఁ గావించి, సంభావించి, “పుళిందా ! నీ విందు నిశ్చలభక్తి చిత్తంబున ‘మరామరా’ యటంచు జపించుచుండు” మని యనుగ్రహంబున రామ మంత్రంబిచ్చియమ్మునులు కైలాససందర్శనాభిలాషంజనిరి.

అంత నయ్యాటవికుఁడు నొసటంగల జేగురుబొట్టుఁ దుడిచి తులసిమృత్తిక దాల్చి కటింగల నీలిచీరంబాసి నార చీరంగట్టి దండకమండల జటాభరాదులఁ గేవల ముని వేషంబు నివ్వటిల్ల,

గీ॥ దినముఁ దమసాతరంగిణీతీర్థమునను
స్నానమొనరించు యత్యంతశాంతి మెఱయ
మౌను లుపదేశమిచ్చిన మంత్ర మెపుడుఁ
దపము సేయుచు నక్కిరాతప్రభుండు.

క॥ ఈసరణి వాఁడు సకల
వ్యాసంగము మాని మౌనివర్తన నుండన్
వేసటచే వీఁ డెక్కడ
గాసింబడె ననుచు వానికలవారెల్లన్.

క॥ చెట్టులపట్టుల గట్టుల
చుట్టుల నందంద వెదకి సొలయుచు నొకచో
నట్టడవిలోనఁ గదలక
చట్టుంబలె నున్నవానిచందము గనుచున్.

క॥ ఇయ్యడవి వీని నేలలు
దయ్యంబులు వ్రేసెనో కొఱ తరలకయుండన్
డయ్యఁ డొకింతయు మనతోఁ
గుయ్యన నొల్లండు కన్నుఁగొన తెఱవంగన్.

గీ॥ అకట! చెడి వీని నెవ్వఁడో యంకగాఁడు
తప్పుసుద్దుల బుద్ధులు తగులుకొలిపి
బోయజాతికి వెలిగాఁగఁ బాయఁజేసి
యాలుబిడ్డల మనుమల నలియఁజేసె.

వ॥ అని వానిం జేరుకొని యందఱు మఱియు నిట్లనిరి.

సీ॥ కన్నులు దెఱవని గండభేరుండంపు
నిసువుల నెవ్వరు నేర్తు రరయ
నేనుంగుతలపోల సెవ్వరు దెత్తురు
పెంచిన సింగంపుఁ బిల్లలకును
కవిసిన దొడ్డిలోఁ గాఱెనుపెంటుల
దట్టించి యెవ్వారుకట్టఁగలరు?
పులుల కూనలకు రేపునుమాపుఁ దగునట్టి
మేపు లెవ్వరుదెచ్చి మేపువారు?
గీ॥ ఇంట నీ వటు లేకున్న నిట్టిపనులు
కుఱుచబుడుతలచే నౌనె కొలమువారు
చాల నెగ్గింప జాలును జాలు నింక
నుడుటుతనమెల్ల మాని యిట్లుండ నగునె?

ఉ॥ కానకు నేగి వింతరుచిఁ
గల్గెడు పిట్టలుఁ జెట్టు జున్నులున్
దేనెలుఁ జారపప్పులును
దెచ్చుఁగదా యికనంచుఁ గూళ్ళలోఁ
గూనలువోని నీకొడుకుఁ
గుబ్బలు నీదను దెంచుత్రోవఁ జూ
పానఁగ నిల్తు రయ్యెడలు
హా! మముబోంట్లకుఁ జూడవచ్చునే?

గీ॥ తెల్లవారిన గుండగ్గికోళ్ళలీల
నీళ్ళమునుఁగుచు నోడలెల్లఁ దెల్లబాటి
నిట్రిపాసంబులను గూడి నెవ్వఁ డొడరు
వెడగుబాపనతగులునఁ బడితివేల?

వ॥ అని యివ్విధంబున నావ్యాధులెల్ల మహావ్యాధులుంబోలె వానిని బాధింప శబరనాథుండును,

క॥ కనుదెఱచి నవ్వి యేమియుఁ
బని లే దని ముందు మీరు పలికితి రిపు డే
పని కిటు వచ్చితి రిందఱు?
జనుఁ దెలుఁగుదు మీదుమాయ జరుగునె యింకన్?

గీ॥ తండ్రి రాముఁడు జనకజ తల్లి యెల్ల
బంధులును నాకు నాస్వామిభక్తు లెన్న
నింతవాఁడను నా కెందు నెదురు గలదె?
సకలజగములు నేలుదు సుకరముగను.

క॥ మీ రెవ్వరు మే మెవ్వరు
నేరము లెంచక చనుండు నిలువక యెటకే
శ్రీరఘుపతియే నాకు న
కారణబంధుండు గురుఁడు గణుతింపంగన్.

వ॥ అని యాశ విరుగంబలికిన నవ్వనచరులెల్లరు వానిని విడిచి యెందేనియుం బోయిరి. తాపసోపదేశానుసారంబుగ నానిషాదుండు జపించుచుండు 'మరామరా' శబ్దంబులు క్రమంబుగ రామరామ శబ్దంబులై వాని నత్యధికమహిమాఢ్యుం జేయుచుండెను. ఇట్లనంతశాంతగుణస్వాం

తుఁడై యామహామాహాత్మ్యుం డచ్చట నభంగధ్యాననిష్ఠాగరిష్ఠుండై తపంబు సేయుచుండ నేడేండ్లు గడచుటయు లేశమును జనసంచారము లేమి నాప్రదేశమంతయుఁ జెదపురువ్వుల కాలవాలమై విషసర్పంబుల కాటపట్టులగు పెక్కుపుట్టలు పుట్టెను. దానంజేసి యాతపోధనుని చుట్టును జుట్టికొని పుట్టి యొకమహావల్మీకము తాళప్రమాణంబుగ వ్యాపించె.



రామునంతో ప్రియ దేశకర్తలగు మహర్షులు కైలాసంబునకుఁ బోయి మఱలివచ్చుచు నాప్రదేశంబును సమీపించినంతనే వారికి దొల్లింటి బోయవాని వృత్తాంతము చిత్తంబులకుస్ఫురింప నా బోయ యెందుఁ బోయెనోయని యిటునటుఁ బరిశీలింపసాగిరి. అప్పు డాకాశవాణి 'రామభక్తుం డీ వల్మీకముననున్నవాఁ' డని వారి కెఱింగించెను. పుట్టకు నట్టనడుమనున్న యారామభక్తుండును మునుల మాటలు విని వల్మీకమును భేదించుకొని యుదయార్కబింబంబు పగిది తేజరిల్లుచు వెలుపలికి వచ్చి వారలకు నమస్కరించెను. మహర్షులు వాని తేజోవిశేషంబుల కాశ్చర్యపడుచు,

క॥ ఈజట లీ కృష్ణాజిన
మీజపమాలికయు శాంతి యెట్లు కలిగెనో
యీజగదాంగకు నోహో
శ్రీజానిస్మరణమహిమ చెప్పఁగ వశమే?

వ॥ వీడు ప్రహ్లాదనారదపరాశరవ్యాసపుండరీకాదులలో నొకండుగాని సామాన్యుండు గాఁ డని తమలోఁ దాము పలుకుకొనుచువాని నెంతయు నభినందించి యథేచ్ఛంజనిరి. వాఁడు వల్మీకంబునం బుట్టిన కతన వాల్మీకి యను నామధేయంబు వహించె. అవ్వాల్మీకి మహాముని యు నంతకంతకంతరంగంబున నుప్పొంగుభక్తివిశేషంబున నిరంతరజపశీలుండై యుండ వానిచిత్తశుద్ధికి నలరి రామభద్రుం డొకనాఁ డతని యగ్రభాగంబున సాక్షాత్కరించె. వాల్మీకి తన

నిర్మలభక్తి స్తోత్రంబుల నాజానకీజానిని రంజింపఁజేసి యిట్లనియె.

ఉ॥ శ్రీరఘురామ! భానుకుల
శేఖర! నీ పదపద్మసేవ మం
దారనగంబు, ముంగిటి ని
ధానము, తంగెటిజున్ను, కొంగుబం
గారము, వేల్పుమానికము,
కైవసమైనధనంబు, చేరువౌ
మేరువు, కామధేనువు స
మీపసుధాంబుధి, నాకు నెప్పుడున్.

వ॥ అని సన్నుతించిన సంతసించి రామభద్రుండు నిర్మల తాత్పర్యంబున నమ్మునివర్యుని మస్తకంబున హస్తస్పర్శకంబు గావించి, యో మునికులతిలకా! నీభక్తికి మెచ్చితి. మచ్చరితంబు భవ్యంబగు కావ్యంబుగా నొనరింపు మని యానతిచ్చి చనియె. అంత వాల్మీకియు జానకీవల్లభుని భక్తసులభత్వంబును గొనియాడి మృదుపదసందర్భరస గర్భితార్థచమత్కారపారాయణంబుగా రామాయణంబు వక్కాణించె. అట్టి రామాయణంబు సకలలోకప్రసిద్ధంబయ్యె.

క॥ శ్రీకరమై తగు నవ్వా
ల్మీకిచరిత్రంబు భక్తిమెఱయఁగ నెపుడున్
జేకొని చదివిన వినినన్
జేకురు వారల కభీష్టచిరశోభనముల్.

---

## ఉత్తరరామాయణము.

# 17 కుశలవ చరిత్రము

## 1 వ భాగము.

---

[కంకంటిపాపరాజు - ఇతఁడాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు - నెల్లూరు మండలమువాఁడు, 1790 సం॥ ప్రాంతమువాఁడు. ఇతఁ డుత్తరరామాయణమును వ్రాసెను.]

---

వ॥ వల్మీకోద్భవుఁడు గఱపెడు విద్యాబుద్ధులచే దినదినప్రవర్ధమానులై జానకీసూనులు తల్లికిని దక్కటివారికిని సంతసంబార మెలంగుచుండ, నచ్చట నయోధ్యానగరంబున రామభద్రుఁడు సీతాపరిత్యాగంబువలని మనఃక్లేశంబు వాయఁ బుణ్యకథాశ్రవణంబునఁ బ్రొద్దులువుచ్చుచు నశ్వమేధంబొనరింప సమకట్టి, లక్ష్మణుంజీరి, "వత్సా! నీవు చని కశ్యప కుత్స వసిష్ఠ కణ్వముఖ్యనిఖిలసన్మునీశ్వరులం దోడ్కొని రమ్ము! నావుడు నతండును నట్లకావించె. భరతాదులు గొల్వ నిండుకొలువై యున్న భూకాంతుఁడు వచ్చిన మునికులతిలకుల కెదురుగవచ్చి పూజించి తోడితెచ్చి యుచితాసనాసీనులం గావించి తన యశ్వమేధసంకల్పము విన్నవింప వారెల్లరు నత్యంత హర్షోత్కర్షంబున సమ్మతించిరి.

చ. అనితరపుణ్యులారభువ
నాంచితమౌ హయమేధ మేను మీ
యనుమతిఁ జేయఁ బూఁడనని
యాత్మఁదలంచితి; మీర లమ్మఖం
బునకు ననుజ్ఞయిండనిన
బోరన నమ్మునులెల్లఁ బల్కిరో
జనవర! ముజ్జగంబులకు
సమ్మత మా క్రతు వాచరింపవే.

అంత రాఘవుఁడు నైమిశారణ్యమున గోమతీ నదీతీర భూమియందు హయమేధమును గావింప నిశ్చయించి తత్క్రతుసందర్శనార్థము సుగ్రీవాంగద హనుమన్నీల జాంబవద్గవయ గవాక్ష నల సుషేణ ప్రముఖులను విభీషణ కేకయాధిప విదేహాద్యఖిలదేశాధీశ్వరులను నానాదేశ విప్రులను బ్రహ్మర్షి దేవర్షి గణంబులను రావించె. సామంతమంత్రిపురోహితప్రముఖులును భరతాదులైన సోదరులును రామాజ్ఞ ననుసరించి యజ్ఞశాలాదిక సకలనిర్మాణంబులును యథావిధి నొనరించిరి. విశ్వకర్మం బురుడించు శిల్పకారులు తమ యనల్పశిల్పకలాకౌశలం బేర్పడ బంగారు సీతమ్మను సృష్టించి తెచ్చిరి. అంత సంపూర్ణలక్షణసంపన్నంబైన క్రతుహయంబు విడువంబడియె. వేగజితకురంగంబగు నాతురంగంబున కంగరక్ష

కుండై చతురంగబలసమన్వితుండై లక్ష్మణుండు వెడల
రాముం డానతిచ్చె.

చ॥ అతఁడు ననేక సైనికస
మన్వితుఁడై బహుబుత్విగావళీ
యుతుఁడయి శత్రుభీకర బ
లోద్ధతుఁడై చతురంతధారుణిం
గ్రితుతురగంబుఁ ద్రిప్పి భుజ
గర్వముదక్క సమస్తధారుణీ
పతులును భీతులై తన కు
పాయనముల్ తగ నిచ్చి కొల్వఁగన్.

ఉ॥ రాజకులాభిరాముఁడగు
రాముని తమ్ముఁడు లక్ష్మణుండె యి
త్తేజికి రక్షకుండు ధర
ధీరులు గల్గినఁ బట్టుఁడంచు, న
వ్వాజిలలాటపట్టమున
వ్రాసిన వ్రాల్ గని దానిఁ జేర రే
రాజులు భీతులై తమపు
రంబులచెంతల సంచరింపఁగన్.

వ॥ అంత రామభద్రుండును యజ్ఞదీక్షం బూని. భరతాదుల
దాన మానాదికంబుల శ్రితబాంధవాదులగు క్రితుదర్శ
నాగతులెల్లరు నిరంతరసంతృప్తు లగుచుండిరి.

చ॥ ఎడపక యోఁడుగాలమిటు
లేగఁగ లక్ష్మణుఁ డంతలోనఁ ద
త్తడిఁగొని తెచ్చినన్ నృపతి
తద్దయు వేడుక యాగకృత్యముల్
నడపుచునుండె; విప్రులు ది
నంబును భోజనదక్షిణాదులన్
గడుముదమంది రందఱును
గాంక్షితముల్ గని రమ్మఖంబునన్.-

చ॥ వలసినభోజనాభరణ
వస్త్రధనాదులఁ జెంది తృప్తులై
పలుమఱుఁ జాలుఁజాలునని
పల్కెడు వారలెగాని మాకుఁ గా
వలయుఁ నొసంగుఁ డంచనెడి
వారల మందునఁ గైనఁగాన మా
స్థలమున జానకీవిభుని
జన్నము వైభవ మెంచ శక్యమే?

ఉ॥ ఆమఖవైభవంబునకు నద్భుతమంది మహర్షు లెంచి రా
రా! మును బ్రహ్మ చేసినమహాధ్వరమున్ మఘవంతుయజ్ఞమున్
సోమునియాగమున్ దపనసూనుమహావంబుదధీశుహోమమిా
రాముని యశ్వమేధమఖరాజముతోఁ బ్రతిసేయవచ్చునే?

క॥ ధనసామగ్రియు నానా
జనసామగ్రియును రామజనవిభునకుఁ గ
ల్గిన కతన నీమహోత్సవ
మొనరించెంగాక లేక యొరులకు వశమే?

మ॥ అని సభ్యుల్ గొనియాడఁగా రఘుకులా
ధ్యక్షుండు సంవత్సరం
బును బూర్ణంబుగ సాంగదక్షిణలచేఁ
బొల్పొంద యాగంబు సే
యు నేడం దన్మఖవైభవంబు గనఁగా
నూహించి వాల్మీకి శి
ష్యనికాయంబుఁ బ్రశిష్య సంఘము భ
జింపన్ వచ్చె నచ్చోటికిన్.

క॥ వచ్చిన యమ్మునిచంద్రుని
హెచ్చినరహి నెదురుకొని నరేశ్వరుఁ డర్ఘ్యం
బిచ్చి సపర్యల నాతని
యిచ్ఛయలరఁ గుశల మడిగి యిట్లని పలికెన్.

చ॥ వరమునిచంద్ర! మీ రిటకు
వచ్చుట నామఖమున్ ఫలించె మీ
చరణయుగంబు సోకి క్రతు
శాల పవిత్రతఁ జెందె; మామకా
ధ్వరవిధి పూర్ణమౌ దనుక
వచ్చిన యమ్మునులట్ల మీరు నిం
దిరవుగ నిల్వఁ డంచు విడి
యించెద దర్శగృహాంతరంబునన్.

వ॥ దాశరథిమాట జవదాటఁ జాలక వామలూరు భవుండు శిష్యగణంబులతో నందె నివసించుచుండె. ఆశిష్యగణంబులలో మారనలకూబర మనోహరాకారులును వీణాగాన కలాకుశలులును నగు కుశలవులుఁగూడ నుండిరి. అయ్యాదికవీశ్వరుం డక్కుమారకులం జేరఁజీరి వారల కిట్లనియె. "వత్సలారా! మీ రిందుఁ బ్రతిదినంబును గవపాయక రఘునాయకుని కొలువుకూటమున నేను గఱపిన రామాయణమును గానము సేయుచుండవలయును. మఱియు,

చ॥ స్వరములుఁ దాళముల్ లయలు
సారపు మీటుకోలంబు లేర్పడం
జిరముగ మీకు నారదుఁడు
సేసిన శిక్ష ఫలింప నింక మీ
రిరువురు వీణెలూని దిన
మిర్వదిసర్గల లెక్క రాఘువే
శ్వరుసభఁ బాడుఁ డవ్విభుని
చారు చరిత్రము సభ్యు లానన॥.

మ॥ ఫలమూలాశనులై ధనేచ్ఛవిహియిం
పంబోక రామాయణం
బెలమిన్ రేపటినుండియున్ దొరకొనుం;
డెవ్వారు మీ రంచుఁ గే

వలమైత్రిఁ రఘుభర్త మిమ్మడిగినన్
వాల్మీకిమహాసీంద్రు శి
ష్యుల మంచున్ వచియింపుఁ డవ్విభుఁదలం
పుం డాత్మలోఁ దండ్రిగన్.

వ॥ ఏల యంటిరేని భూవల్లభునిఁ బితృసమానునిగాఁ దలంచుట ప్రజలకు ధర్మంబు. కావున మీ రా రామభూవల్లభుం దండ్రిగా భావించుచుండవలయు." అని యాజ్ఞాపించుటయు నక్కవలు మహాప్రసాదం బని యారేయి గడపి మఱునాఁడు వేగుటయు నప్పటి కృత్యంబులెల్లఁ దీర్చి వీణాపాణులై వెడలి రామభద్రుని యజ్ఞశాలం జొచ్చి రామాయణమును బాడసాగిరి. పదసందర్భములు నర్థకల్పనలు నలంకారములు రసౌచిత్యప్రభావములు బహుగతుల నలరారు జగత్పూజ్యంబైన శ్రీరామాయణ మహాకావ్యంబునందలి మొదటి శ్లోకంబు లోక కొన్ని కుశలవకుమారులు జగన్మోహనముగ గాన మొనర్చినంతనె రాముం డాలకించి తన్మధురగానశ్రవణానందపరవశుండై హోమకృత్యంబులు దీర్చి వచ్చి కవిగాయకపురోహితమంత్రి సామంతబంధుమిత్ర పరివారంబులతో నిండుకొలు వుండి సీతానందనులఁ దనచేరువ నెకూర్చుండఁజేసి వారిముఖంబున గానమాధురీమేదురంబైన రామాయణ కథావిధానంబును సావధానంబుగ నవధరింపసాగెను.

---

# 18 కుశలవచరిత్రము

## 2 వ భాగము.



లక్షలకొలందిగల జనులతో నిండి సప్తసముద్ర ఘోషంబులం బురుడించు మహాధ్వనుల కాలవాలంబై యుండిన యయ్యజ్ఞశాలయంతయుఁ బసిపాపలగు కుశలవుల మనోహరగానకలావిశేషంబున క్షణంబులో నిశ్శబ్దంబయ్యె. మఱియు నక్కుమారవరులిరువురును రఘువరునకు మిక్కిలిసమీపంబుననె యుపవసించినవారగుటంజేసి వారల మనోజ్ఞాకారంబులయందు రామచంద్రుని యాకారవిశేషంబు లుండుట యెల్లవారలకును స్పష్టంబయ్యె.

ఉ॥ ఈ ముఖకాంతు లీ నగవు
లీకనుదామర లీమెలుంగు లీ
చామనచాయ లీ యొగుభు
జంబుల పొంకము లీ యురంబు లీ
కోమలమూర్తు లీ వచన
గుంభనలున్ గనుఁగొన్న గట్టిగా
రామునిలీల మించి రభి
రామశరీరులు వీర లెవ్వరో ?

ఉ॥ హారకిరీటకుండలభు
జాంగదవస్త్ర సుగంధమాల్యముల్
వీరు ధరింప కీజటిల
వేషము లేటికి దాల్చిరో? శుభా
కారవిలాససంపదలఁ
గంతు జయంతుల ధిక్కరించి నా
శేబుషిపుత్రులో బుషుల
కెక్కడి వీమహనీయరూపముల్!

వ॥ అని యిట్లు సభ్యులెల్లరుఁ దమలోఁ దా మాడుకొను మాటలవలని కలకలంబంతయు లక్ష్మణుండు చే సంజ్ఞల నివారించుటయు నత్యధిక ప్రోత్సాహితులగు నావత్స లిరువురు నాడు రామాయణమునందలి యిరువది సర్గలను గానము చేసిరి. రాఘవేశ్వరుఁ డబ్బాలకుల యనవద్య గానవిద్యాకౌశలమున కెంతయు మెచ్చి వారికిఁ బదివేల వరా లిమ్మనుటయెగాక వారు కోరినవెల్ల నొసగూర్పు మని భరతున కాజ్ఞాపించెను. ఆ పలుకులకు సీతకొడుకులు చిఱునవ్వు నవ్వుచు కరములు మోడ్చి "రామచంద్రా! కానలఁ గందమూలములు గుడుచుచుఁ దాపసవృత్తి నుండు వారి కిట్టిధనంబు లేల" యని పలికిరి. రామచంద్రుం డంత తోఁ నూరకుండక,

చ॥ అనియె గుణాఢ్యులార! నిజ
మా నది యీకృతి యెవ్వ రాచరిం
చినయది, యేప్రమాణమునఁ
జెల్వగు, నెవ్వని దీచరిత్ర, మిం
దున కభిధానమే, మెలమి
తో నిది యెవ్వరివంక నేర్చినా
రనిన వినీతులై కుశలవా
హ్వయు లిట్లని రమ్మహాత్మతో.

సీ॥ ఇనవంశ శేఖర! యీకావ్యమణి విని
ర్మించిన సుకవి వాల్మీకిమౌని
రామాయణం బనునామంబు దీనికిఁ
గావించె నది భవత్కథయ సుమ్ము
విను మిరువదినాల్గువేల గ్రంథం బిది
యేనూఱుసర్గల నింపుగులుకుఁ
బట్టాభిషేచనపర్యంత కథ లాఱు
కాండంబుల రచించెఁ గడమకథయు

నవల నుత్తరకాండంబునం దమర్చె
నమ్మహామౌని యతని దయానిరూఢి
నేను నేర్చితి మిది విన నిచ్ఛగల్గె
నేని విననగు దినమును నివ్విధమున॥

వ॥ దేవా! ఇమ్మఖదీక్ష దీర్చినపిమ్మట మాగీతములు సాఫల్యమొందఁ సావధానంబుగ నీ కావ్యంబంతయు వినవలయు నని కోరుచున్నా మనవుడు రామచంద్రుఁడు వల్లెయని విప్రపురోహితబంధుమిత్రపరివారసమేతుండై ప్రతిదినంబును రామాయణంబు వినుచుండెను. పూఁదేనియలొలికినగతిఁ గప్పురంబుఁబొడి చిందినకైవడి, జాజిపొట్లమ్ములవిప్పిన చొప్పునఁ దమ జగన్మోహనగానకళాకౌశలము నెఱపుచుండ, రామభద్రుం డొక్కనాఁడు కుశలవులతనూవిలాసంబులఁ బరిశీలించి, "వీరియాకారములు జానకీరమణి కైవడి నున్నవి. మున్ను భూజాతకుఁ గవ లుదయించిరనియు వింటి. ఈ డింభకులు సీతాడింభకులుగా గాకున్న నింతడి చెలువంబుగలుగునే"యని భావించి,

చ॥ జడలుధరించి కృష్ణమృగ
చర్మములుం బలు నారచీరలుం
గొడుకులుదానుఁ గట్టు
కొని కూరలఁగాయల త్రుత్తుమాన్పుచుఁ
గుడిగొను వంత రేవగలుఁ గుందు
చు నెంత నలంగియున్నదో
యడవులలోన సీత యక
టా! యిఁకఁ జూడక యెట్లు తాళుదుఁ!

లోకులాడుసడి కోర్వలేక యిట్లుచేసితి. నాయపరాధంబు మన్నింపుఁడు. ఇందలి జనంబు లెఱుంగ నిం కొకసారి మహీకుమారి శపథంబొనరింపందగు' ననుటయుఁ దోడనభూమి పట్టి పతిపదారవిందంబుల డెందంబున నిలిపి కరాంబుజంబులు మొగిడ్చి తలవాంచి నేలపై దృష్టి సారించి సభ్యులెల్లరు విని విస్మయం బంద నిట్లనియె.

శా॥ రామస్వామిపదాంబుజంబు లెద నా
రాధింతు నేనిఁ సదా
రామాజ్ఞం జరియింతు నేనిఁ దగుజా
గ్రత్స్వప్న సుప్త్యాదులన్
రాముం దప్పనిదాననౌటయు యథా
ర్థం బేని నాతల్లి! యో
భూమీ! యీయెడఁ దోవఁ జూపి ననుఁ
గొంపోవమ్మ! నీలోనికిన్.

వ॥ అని సకలబృందారకసందోహంబుల కానందంబును నరవానరనిశాచరప్రముఖనిఖిలజనంబులకు శోకదైన్యంబులు నుప్పతిల్లంబలికి ననప్పలుకులతోడనే మహీతలంబు భేదించుకొని భూదేవి దేవగంధర్వకాంతారత్నంబులతోఁ బ్రత్యక్షమై కూఁతుం గౌగిలించుకొని కన్నీరు దుడిచి యూరార్చి తా నెక్కివచ్చిన మణిపీఠంబుపైఁ జేర్చుకొని యుండా దిదిక్పాలకులు మందారకుసుమంబులు గురియుచుండ

నసువంటి మచ్చెకంటికిఁ దత్ఫలం బనుభవింపక పోవచ్చునే? రచ్చలోకి వచ్చి బాస యిచ్చి పతికింగల రిచ్చపాటు తొలంగింపక తప్పదు. విజయంబు సేయుం' డని వానితో నాశ్రమంబు నిర్గమించెను.

వాల్మీకి భవుండు సీతాంగనాసమేతంబుగ నాశ్రమంబు వెలువడి వచ్చి రామభద్రుని యజ్ఞవాటికం జొచ్చి, దివినుండి బృందారక బృందంబులును భువినుండి సకలజన సమూహంబులుం గడు నక్కజం పడి కనుంగొనుచుండ సమస్త పరివార సంపూర్ణంబైన మహాసభాంతరంబునఁ బ్రవేశించి, రఘువీరుని పురోభాగంబున నిలిచి, ప్రజల కలకలంబులు చేసన్నల నివారించి, యాసన్నులై దివినున్న దేవతలును సభనున్న సమస్తజనంబులు నాకర్ణింపఁ బ్రావృడంభోదగంభీరఘోషంబున నిట్లనియె.

మ॥ దిననాథాన్వయ! యీధరాతనయ
పాతివ్రత్యముఁ సత్యముఁ
గనియుఁ నీవు జనాపవాదగతశం
కఁ నిందుచూలాలిఁ గా
ననసీమం దిగఁద్రోయఁబంచుటయు దై
న్యం బొంది యస్మద్వనం
బునకుఁ వచ్చి కుశుఁలవుం గనియె నీ
పుణ్యుల్ భవత్పుత్రికుల్.

వ॥ కావున నీధర్మచారిణియైన సీతాసతిని నీతనయులైన కుశ లవులం బరిగ్రహింపుము. ఇమ్మహాసాధ్వి నీ వనుమానింపం బని లేదు. శ్రుతులెల్ల నేర్చి యధికతపోవిభూతి నొంది



నీయెడ నసత్యంబు లాడ నేర్తునే? గగనసూర్యచంద్రాగ్నితోయంబులు సర్వసుపర్వులు సాక్షులుగా సుమారమారమణీమణులకరణి భూమిసుత మహాపతివ్రత. అనవుడు రామభద్రుండు బద్ధాంజలియై "మునిసత్తమా! జానకిం దెలిసియు

లోకులాడుసడి కోర్వలేక యిట్లుచేసితి. నాయపరాధంబు మన్నింపుఁడు. ఇందలి జనంబు లెఱుంగ నింకొకసారి మహీకుమారి శపథంబొనరింపందగు' ననుటయుఁ దోడనభూమిపట్టి పతిపదారవిందంబుల డెందంబున నిలిపి కరాంబుజంబులు మొగిడ్చి తలవాంచి నేలపై దృష్టి సారించి సభ్యులెల్లరు విని విస్మయం బంద నిట్లనియె.

శా॥ రామస్వామిపదాంబుజంబు లెద నా
రాధింతు నేనిక్ సదా
రామాజ్ఞం జరియింతు నేనిఁ దగుజా
గ్రత్స్వప్న సుషుప్త్యాదులన్
రాముం దప్పనిదాన నౌటయు యథా
ర్థంబేని నాతల్లి! యో
భూమీ! యీయెడఁ ద్రోవఁ జూపి ననుఁ
గొంపోవమ్మ! నీలోనికిన్.

అని సకలబృందారకసందోహంబుల కానందంబును నరవానర నిశాచరప్రముఖనిఖిలజనంబులకు శోకదైన్యంబులు నుప్పతిల్లంబలికి ననప్పలుకులతోడనే మహీతలంబు భేదించుకొని భూదేవి దేవగంధర్వకాంతారత్నంబులతోఁ బ్రత్యక్షమై కూఁతుఁ గౌఁగిలించుకొని కన్నీరు దుడిచి యూరార్చి తా నెక్కివచ్చిన మణిపీఠంబుపైఁ జేర్చుకొని యుండ దివిదిక్పాలకులు మందారకుసుమంబులు గురియుచుండ

రసాతలంబునకు గొనిపోయె. అమ్మహామహిమంబున కెల్ల వారలు వింతపడి సీతలేమికి నెంతయు వంతపడిరి.

రాముండును సీతావియోగంబు భరింపలేక తన సుతులైన కుశలవులఁ బట్టభద్రులంజేసి తన సోదరులగు లక్ష్మణాదులతో సరయూనదిం జొచ్చి మహావిష్ణుండై వైకుంఠంబునకుఁ బోయి యందు మహాలక్ష్మియైయున్న సీతంగలిసి కొనియె. అందు లక్ష్మీనారాయణులు సకలదివ్యభోగానందంబుల నుల్లసిల్లుచు నార్తత్రాణపరాయణులై జగంబులఁ బాలించుచున్నవారలు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

ఉ॥ ఎంచి పురాణగాథల ర
చించిన మా దగు వాచకంబులన్
గొంచు పఠించు బాలకుఁ
కున్ శుభమున్ సువివేకముం బ్రసా
దించి, ముకుందుఁ డున్నతులఁ
దేలిచి ప్రోచునుగాక వీనివ్రా
యించి యశంబు గైకొనిన
యేలూరు వేంకటరామ కంపెనిన్.

---